

*Photo by:* T. SURYANARAYANA

నేను
పొదుపు
చేశాను

నువ్వు?

విద్యార్థుల కొక
ప్రత్యేక
ఆహ్వానం!

పొదుపు చేయడం నేర్చుకోండి!

నేడే బాంక్ ఆఫ్ ఇండియాలో సేవింగ్స్ బాంక్ అక్కౌంట్ ప్రారంభించండి.

12 సంవత్సరాలు, ఆపైబడ్డ పిల్లలందరూ వారికి వారే తమ తమ అక్కౌంటులను నిర్వహించు కోవచ్చును.

మీ పొదుపు ధనం మీద వడ్డీ లభించును.

మీరు ఫిక్స్‌డ్ డిపాజిట్స్, రికరింగ్ డిపాజిట్స్ ద్వారా కూడా పొదుపు చేయవచ్చును.

వివరములకు : బాంక్ ఆఫ్ ఇండియా వద్ద మిమ్ములను కలుసుకోవడం మాకు సంతోషదాయకం.





బాంక్ ఆఫ్ ఇండియా

మీ మంచి భవిష్యత్తు ఈ నక్షత్రంలో కలదు!

RAAS/B/129



# చందమామ

సంస్థాపకుడు, నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["విలువిద్యా ప్రదర్శనం"]కు "వసుంధర" పంపిన కథ ఆధారం. ఏ పనికైనా నిజంగా సమర్థుణ్ణి నిర్ణయించటం తేలికైన పని కాదు. రాజుగారి అంగరక్షకుణ్ణి నిర్ణయించటానికి ఎంత తతంగం అవసరమైనదీ ఈ కథ చెబుతుంది.

కొందరు తమ సామర్థ్యాన్ని ఒక్కొక్క సారి తామే బయట పెట్టుకుంటారు. ఇందుకు ఉదాహరణ "కోళ్ళ దొంగ" అన్న కథలో చిన్నడు; "వింతకానుక" అన్న కథలో కాళిదాసు కూడానూ.

సంపుటి 54 అగస్టు '73 సంచిక 2

CP

CHITRA



# అమరవాణి

యాచ్ఞా మోఘా వర మధిగుణే
నా ధమే లబ్ధకామా. 1

[అధముణ్ణి యాచించి కోరిక తీర్చుకోవటం కంటె గుణవంతుణ్ణి యాచించి వరం పొందలేక పోవటమే మేలు.]

స్వజనస్య హి దుఃఖ మగ్రతో
వివృతద్వార మి వోపజాయతే. 2

[దుఃఖంలో ఉన్నవారికి తమవారు కనబడగానే దుఃఖం పెల్లుబికి వస్తుంది.]

విష మ ప్యమృతం క్వచి ద్భవేత్,
అమృతం వా విష మీశ్వరేచ్ఛయా. 3

[ఈశ్వరేచ్ఛ చేత అమృతం ఒకరికి విషం గానూ, విషం మరి యొకరికి అమృతం గానూ అవుతుంది.]

కస్యై కాంతం సుఖ ముపనతం
దుఃఖ మే కాంతతో వా,
నీచై ర్గచ్ఛ త్యుపరిచదశా
చక్రనేమి క్రమేణ. 4

[ఎవరికీ సుఖం గాని, దుఃఖం గాని ఎల్లప్పుడూ ఉండదు. మానవుడి దశ బండిచక్రపు ఆకుల లాగా పైకీ కిందికీ పోతూ ఉంటుంది.]

కాళిదాసు సూక్తులు



# మైనపు బొమ్మ

రాజగడరాజైన దేవపాలుడు సపరివారుడై వేట నుంచి తిరిగి వచ్చేటప్పుడు అతని వెంట ఒక అపురూప సౌందర్యవతి పల్లకీలో నగరానికి వచ్చింది. అరుగురు బోయీలు ఆమెను పల్లకీలో మోసి తెచ్చారు.

దట్టమైన అరణ్యంలో, తెల్లని బట్టలు కట్టుకుని, ఒక పెద్ద చెట్టు కింద ఏడుస్తూ కూచుని ఆమె రాజుకు కనిపించింది.

రాజు ఆమెను సమీపించి, "ఎవరు నువు?" అని అడిగాడు.

"నేనొక రాజకుమార్తెను. నా తండ్రినీ, ఆయన పరివారాన్నీ చంపిన రాక్షసి నన్నిక్కడికి తెచ్చింది," అన్నదామె తియ్యని కంఠంతో.

రాజు ఆమెను చూసి జాలిపడి మృదువుగా, "ఇప్పుడేం చెయ్యదలిచావు? ఇక్కడే ఉండి పోతావా? కావాలంటే నా వెంట నిన్ను తీసుకుపోతాను. నీకు అదివరకే వివాహం కాకుండా ఉంటే నిన్ను నా రాణిగా చేసుకోవటానికి కూడా సిద్ధంగా ఉన్నాను," అన్నాడు.

"ఒక్క షరతు మీద నేను మీ సూచనకు ఒప్పుకుంటాను. నేను ఏది చెయ్య తల పెట్టినా మీరు అభ్యంతరం చెప్పకూడదు," అన్నదామె.

ఆమె సౌందర్య విలాసాలు చూసి ముగ్ధుడైపోయి రాజు ఆమె షరతుకు సమ్మతించి, ఆమెను అప్పటి కప్పుడే వివాహం చేసుకున్నాడు. తరవాత ఆయన ఒక పల్లకీ తెప్పించి, అందులో తన కొత్త రాణిని మోయించుకుని నగరానికి తిరిగి వచ్చాడు. ఆయన తన కొత్త రాణికి మోహిని అని పేరుపెట్టాడు.

దేవపాలుడికి అదివరకే ఒకరాణి ఉన్నది. ఆమె పేరు రూపరాణి. ఆయన రూపరాణిని పెళ్ళాడి పదేళ్ళు దాటింది. కాని ఆమెకు

ఎ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు




ఇంతవరకు సంతానం లేదు. అందుచేత ఆయన మరొక భార్యను చేసుకోవటానికి నిశ్చయించాడు.

అయినా రూపరాణి ఎంతో మనోవేదన అనుభవించింది. ఆమె సంతానం కోసం శివుణ్ణి ప్రార్థించింది. ఆమె ప్రార్థన ఫలించి గర్భవతి అయింది. అది తెలిసి దేవపాలుడు రూపరాణి యెడల ప్రసన్నుడయాడు.

అందుచేత మోహినికి కోపం వచ్చింది. తనను చెల్లెలిలాగా చూసుకుంటున్న రూపరాణికి ఆమె ఏదైనా కీడు చెయ్యాలని నిశ్చయించుకున్నది. పాపం, రూపరాణి మోహిని పట్ల ఎన్నడూ అసూయపడలేదు; ఆమె రాక విధినిర్ణయంగా స్వీకరించింది.

రూపరాణికి నెలలు నిండాయి. ఆమె తొలి ప్రసవం దగ్గిరపడింది. మోహిని కోపం మరింత అయింది. ఆమె లోలోపల ఈర్ష్యతో దహించుకు పోతూ కూడా మాటలలోగాని, చేతలలోగాని ఆ సంగతి పైకి కనిపించనియ్యలేదు. ఆమె తనకు ద్రోహం తలపెట్టినట్టు రూపరాణి ఏ మాత్రమూ శంకించలేదు.

మోహిని రాజుతో, "మా అక్క రూపరాణికి నేను ఒక్కత్తెనే పురుడు పోస్తాను. ఎవరూ ఆ చాయలకు రానవసరం లేదు," అన్నది గోముగా.

"అదే నీ కోరిక అయితే అభ్యంతరం లేదు. కాని మన ఆస్థానపు మంత్రసాని ఉన్నది గద?" అన్నాడు రాజు.

"ఆపాటి నేనూ చెయ్యగలను. మీ కేమీ దిగులు వద్దు," అన్నది మోహిని ధైర్యంగా. ఇకనేం? రూపరాణి ప్రసవం మోహిని ఒంటి చేతిమీదుగా జరిగేటట్టు ఏర్పాటయింది.

ఇంతకూ ఈ మోహిని అరణ్యంలో ఉండే ఒక మాంత్రికురాలు. ఆమె తన మంత్రశక్తితో అందగత్తెగా తయారయింది. ఆమె ఉద్దేశం రాజునూ, రాజ్యాన్నీ నాశనం చెయ్యటం. మహా శివభక్తురాలైన రూపరాణి రాజభవనంలో ఉన్న కారణంచేత మోహిని మంత్రాలేవీ పారలేదు. ఆమె ఎలాగైనా రాజునూ, రాణినీ వేరు చేయాలనుకుని,

రాజభవన రక్షకులకు లంచం పెట్టి, రూప రాణి ప్రసవించే రోజున ఒక పథకం వేసింది. పురుటి గదిలో రూపరాణితోబాటు మోహిని మాత్రమే ఉంది. ప్రసవం కాగానే ఒక గంట మోగిస్తానన్నది. రూపరాణి ఒక చక్కని మగబిడ్డను ప్రసవించింది. తన వద్ద లంచాలు పుచ్చుకున్న భటులకు మోహిని ఆ బిడ్డనిచ్చి, దూరంగా అరణ్యంలో గోతిలో బిడ్డను పూడ్చమని చెప్పింది. స్పృహ లేని రూపరాణి పక్కలో ఆమె ఒక మైనపు బాతుబొమ్మను ఉంచి, గంట మోగించింది.

గంట విని ఆత్రంగా పరిగెత్తుకుంటూ వచ్చిన రాజు మైనపు బాతు బొమ్మను చూసి నిర్ఘాంతపోయాడు.

"మహారాజా, మీ వారసుణ్ణి ముద్దు చెయ్యండి," అన్నది మోహిని, హేళనగా మైనపుబాతును చూపుతూ.

దేవపాలుడు చిరాకుపడి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. రూపరాణి పట్ల ఆయన మనసు విరిగిపోయింది. ప్రతిరోజూ మోహిని ఆయనకు రూపరాణి మీద ద్వేషాన్ని రెచ్చ గొట్టుతూ వచ్చింది. చివరకు ఆయన రూప రాణిని మాయావిని అని ప్రకటించి, ఆమెకు దేశబహిష్కరణ విధించాడు.

అరణ్యపు అంచులో రూపరాణి ఒక చిన్న కుటీరం వేసుకుని, శివధ్యానంలో కాలం గడపసాగింది.

ఒకనాడు ఆమె వద్దకు ఒక యతి ఒక బిడ్డను తెచ్చి, "అమ్మా, వీడు నీ కొడుకు.





నువు కన్నది వీణ్ణే. రెండో రాణి కిరాతకు రాలు, మంత్రగత్తె. ఆమె ఈ బిడ్డను పూడ్పించింది. నేను అది చూసి, వెంటనే బిడ్డను గోతిలో నుంచి పైకి తీసి రక్షించాను. నీ కొడుకును నువే తీసుకుని పెంచు," అన్నాడు.

"బాబూ, మీ మేలు మరవను. మీ రుణం తీర్చుకోలేను. నాకు సహాయం చెయ్య గలరా?" అని రూపరాణి యతిని అడిగింది.

"నిస్సందేహంగా! నీకు సహాయం చెయ్యటం నా విధి. అంతేగాదు, ఆ మంత్ర గత్తెను నాశనం చేసి, నిన్నూ, నీ కొడు కునూ రాజభవనంలో ప్రతిష్ఠించటం కూడా నా విధే." అన్నాడు యతి.

రూపరాణి ఎప్పుడైతే తొలిగి పోయిందో అప్పుడే మోహిని తన దుర్మార్గం ప్రారం భించింది. రాజుగారి గజశాల నుంచి ఏను గులూ, అశ్వశాల నుంచి గుర్రాలూ ఒక టొకటిగా మాయం కాసాగాయి. చెట్లు కాయటం మానేశాయి. లతలు పూయటం మానేశాయి. పంటలు పండటం మానే శాయి. రాజు రోజు రోజుకూ చిక్కి శల్యం కాసా గాడు. ఇరుగు పొరుగు దేశాలతో యుద్ధ ప్రమాదం ఏర్పడింది. రాజ్యాన్ని అశాంతి ఆవరించింది. ఒక ఏడాది గడిచే సరికి రాజ్యం అమిత హీనస్థితికి వచ్చేసింది.

ఒక నాడు యతి రాజధానికి వచ్చి, రహస్యంగా మహా మంత్రి అయిన దండ రాజును కలుసు కున్నాడు. దండరాజు ఆయనకు గౌరవ పురస్సరంగా స్వాగతం పలికి, "స్వామీ, నా నుంచి తమకు ఏంకావాలి?" అని అడిగాడు.

యతి ఆయనకు మోహిని దుశ్చర్యలు వివరించి చెప్పి, రూపరాణి తన కొడుకుతో సహా ఎక్కడ ఉన్నదీ తెలిపాడు.

తరవాత ఆయన తన చేతి సంచీ నుంచి ఒక మైనపు బాతు బొమ్మా, ఒక ఇనప మేకూ, ఒక పిండి రొట్టే, ఒక సూదంటు రాయీ పైకి తీశాడు; ఇనపమేకును బాతు బొమ్మ ముక్కులోకి నొక్కి, దాని మొన బాతు ముక్కు చివరలో కనపడేలా

ఉంచాడు; సూదంటురాయిని రొట్టెలో దాచాడు; ఇలా తయారు చేసిన బాతు బొమ్మనూ, రొట్టెనూ దండరాజు కిస్తూ, ఆయనకు ఒక రహస్య ప్రయోగం చెప్పి, శలవు పుచ్చుకున్నాడు.

మర్నాడు దండరాజు నిండు సభలో దేవపాలుడితో, "మహారాజా, ఇప్పుడు ఒక అద్భుతం చూపదలిచాను," అన్నాడు.

ఇలా అని ఆయన ఒక బల్లమీద నీళ్ళ తొట్టి ఒకటి పెట్టించి, ఆ నీటిమీద మైనపు బాతును ఉంచాడు.

"చూడండి, మహారాజా! ఇది ఒక రొట్టె. తమరు ఆజ్ఞాపించి నట్టయితే, ఈ రొట్టెను తినటానికి ఈ బాతు ముందుకు వస్తుంది," అన్నాడు దండరాజు.

"అర్థం లేనిమాట! బాతు బొమ్మ ఎక్కడైనా ప్రాణం ఉన్న బాతులాగా ప్రవర్తించు తుందా?" అన్నాడు రాజు.

"మనిషి గర్భవాసాన బాతు బొమ్మ పుట్టగాలేనిదీ, బొమ్మ బాతు ప్రాణం ఉన్న దాని లాగా ప్రవర్తించటానికి అభ్యంతర మేమిటి? కాకపోతే రెండూ హస్తలాఘవంతో సాధించే పనులే అనుకోండి!" అన్నాడు మహామంత్రి.

ఇలా అంటూ ఆయన తన చేతిలో ఉన్న రొట్టెను బాతుముక్కు వద్దకు తీసుకు పోయాడు. బాతు బొమ్మ ఆత్రంగా రొట్టె కేసి వచ్చింది. నీటి మీద రొట్టెను ఎటు తీసుకు పోయినా బాతు దాని వెంటనే తిరిగింది.



అదే సమయంలో యతి రూపరాణినీ, కుర్రవాణ్ణీ వెంటబెట్టుకుని అక్కడికి వచ్చాడు. వారిని చూసి రాజు గతుక్కుమన్నాడు. యతి రాజుకు ఎదురుగా వచ్చి నిలబడి, తన పెట్టుడు గడ్డాన్ని తీసేశాడు.

రాజు ఆ బ్రాహ్మణ్ణి చూడగానే, "మీరేనా, గురుదేవా? క్షమించండి. మిమ్మల్ని గుర్తించలేదు," అంటూ ఆయన పాదాలకు వందనం చేశాడు.

"ఇంకా చాలా విషయాలు గుర్తించ లేక పోయావు, నాయనా. నీ రెండోరాణి మాయావి అని గుర్తించలేదు! రూపరాణి నీ అదృష్టదేవత అని గుర్తించలేదు! నీకు బాతు బొమ్మ బిడ్డగా పుట్టిందంటే . అది పచ్చి మోసమని తెలుసుకో లేక పోయావు. మోహిని అందం నిన్ను గుడ్డివాణ్ణి చేసింది. నిజం చూపిస్తాను చూడు," అంటూ రాజగురువు తన కమండలం నుంచి ఇన్ని నీళ్ళు తీసి మోహినిపై చల్లాడు.

వెంటనే మోహిని ఒక గూనిదిగా మారి పోయింది. ఆమె ఒంటి రంగు కాకినలుపు! రాజగురువు రెండోసారి నీరు చల్లే సరికి ఆ కుబ్జ పిడికెడు బూడిద అయిపోయింది.

"గురుదేవా, బతికి పోయాం!" అని సభికులు హర్షించారు. రాజు చేతులు కట్టుకు నిలబడ్డాడు.

రాజగురువు ఇలా అన్నాడు:

"నువు మోహినిని తెచ్చినప్పుడే నాకు ఆమె సంగతి తెలుసు. ఆమె మీది వ్యామోహంలో నువు నా మాట వినవని గ్రహించి నిన్ను నేను హెచ్చరించ లేదు. అందుచేత నేను అరణ్యంలో శివుణ్ణి ఉపాసించి, మంత్రగత్తెను మారణ హోమం చెయ్యటానికి ఈ మంత్ర జలం సంపాదించాను. నేను నీ కొడుకు ప్రాణాలు కూడా కాపాడగలిగాను."

రాజు ఆత్రంగా, "వాడేడీ? ఏడీ?" అని అడిగాడు.

"అడుగో, వాడి తల్లి వెంట!" అంటూ దూరంగా నిలబడి, కొడుకును ఎత్తుకుని ఉన్న రూపరాణిని, రాజుకు చూపించాడు రాజగురువు.





# యక్షపర్వతం

## 15

[ గురుభల్లూకుడు సొరంగ మార్గం పైన వున్న ద్వారం దగ్గరకు వచ్చాడు. ఖడ్గ జీవదత్తులు చచ్చిన తోడేలును ద్వారంలోకి విసిరివేశారు. అది చూసిన తోడేళ్ళు కొన్ని సొరంగంలోకి దూకినై. వాటి వెనగ్గా ఖడ్గ జీవదత్తులు ద్వారం పైకి ఎక్కారు. కింద నిల బడి వున్న సమరబాహునూ, అతడి అనుచరుణ్ణీ తోడేళ్ళు చుట్టుముట్టసాగినై. తరవాత—]

బిలదుర్గంలో నుంచి కాక, పారిపోయేం దుకు మరేదైనా మార్గం వున్నదా అని చుట్టూ కలయచూస్తున్న సమరబాహుణ్ణి, అతడి అనుచరుడు పెద్దగా గొంతెత్తి కేక పెట్టి, "దొరా, తోడేళ్ళు మన మీదికివచ్చి పడుతున్నై. చచ్చాం!" అంటూ ఎగిరి గంతేశాడు.

సమరబాహు మీదికి వస్తున్న తోడేళ్ళను చూస్తూనే జీవదత్తుడు సొరంగ ద్వారం నుంచి కిందికి దూకి, చేతిలోవున్న దండంతో వాటిని ఎడా పెడా గట్టిగా కొట్టి, "సమర బాహూ, ఏదిఏమైనా మనం బిలదుర్గంలో జొరబడి, శత్రువులను హడలకొట్టి బయట పడాలే తప్ప, ఇటునుంచి పారిపోయేందుకు దారిలేదు. చప్పున మీ ఇద్దరూ ద్వారం మీదికి ఎక్కిపొండి," అని హెచ్చరించాడు.

ఈ లోపల ఖడ్గవర్మ ద్వారం వెనక నుంచి ముందుకు వంగి రెండు చేతులూ



కిందికి చాచి, "సమరబాహూ! చందూ! త్వరగావచ్చి నా చేతులు ఆధారంగా పట్టుకుని ద్వారం మీదికి చేరండి," అని కేక పెట్టాడు.

సమరబాహూ, అతడి అనుచరుడైన చందూ వెంటనే పరిగెత్తి, ఖడ్గవర్మ చెప్పిన విధంగా అతడి చేతులు పట్టుకోగానే, ఖడ్గవర్మ వాళ్ళిద్దర్నీ ద్వారం మీదికి లాగాడు. కిందవున్న జీవదత్తుడు దండంతో చుట్టుముట్టుతున్న తోడేళ్ళను గట్టిగా అదిలించి, ఎగిరి సొరంగ ద్వారం చేరుకున్నాడు.

ఇప్పుడు నలుగురూ తామున్న సొరంగం లోకి పరీక్షగా చూశారు. గుడ్డి వెలుగులో సొరంగాన ఒక పక్కన పడివున్న చచ్చిన తోడేలు వాళ్ళ కంట బడింది. దాన్ని అక్కడికి విసిరివేసిన వాడు, ఖడ్గవర్మ.

"జీవా! ఒక రకంగా మన ఎత్తుపారినట్టే. ఈ చచ్చిన తోడేలును పీక్కుతినేందుకు నాలుగైదు తోడేళ్ళు సొరంగాన్ని చేరినవి గదా? అవీ, ఆ భల్లూకుడూ, వాడి ముఠా అంతా ఏమైనట్టు? ఇంకా బిలదుర్గంలోనే వున్నారంటావా, లేక అరణ్యంలోకి పారిపోయారా?" అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు వెంటనే ఏమీ జవాబు చెప్పకుండా కొంచెంసేపు బిలంలో నుంచి ఏవైనా ధ్వనులు వస్తున్నవేమో అని శ్రద్ధగా విని, "ఖడ్గా, బిలంలో ఎక్కడో కొంత గందరగోళం జరుగుతున్నట్టు, అస్పష్టంగా నాకు ధ్వనులు వినబడుతున్నవి. నీ కేమీ వినబడటం లేదా? అందరూ ఒకటి రెండు క్షణాలు నిశ్శబ్దంగా వుండి, జాగ్రత్తగా వినిచూడండి," అన్నాడు.

రెండు మూడు క్షణాల కాలం నిశ్శబ్దంగా గడిచింది. అందరికన్న ముందుగా చందూ, "అయ్యా, బిలంలో ఎక్కడో తోడేళ్ళు అరుస్తున్న ధ్వనులు నాకు వినబడుతున్నవి!" అన్నాడు.

సమరబాహు కళ్ళింతచేసి, తలపంకిస్తూ, "నాకు తోడేళ్ళ అరుపులే కాదు, గురు భల్లూకుడు తన శిష్యులకు చేస్తున్న హెచ్చరికలు కూడా వినబడుతున్నవి. మనం

యిక్కడ అట్టేకాలం వుండటం ప్రమాద కరం," అన్నాడు.

జీవదత్తుడు యీ మాటలకు నవ్వి, "ఎవరి భయానికి తగినట్టుగా వాళ్ళకు ఆ ధ్వనులు వినబడుతున్నవి! సమర బాహూ, నీకు వచ్చిన ప్రాణభయం ఏమీ లేదు. మా వెంటరా. బిలంలో ఎదురైన భల్లూకుడి ముఠాను చిందరవందర చేసి నిన్ను సురక్షితంగా బయిటికి తీసుకు పోతాం," అన్నాడు.

"ఏదో సామ్రాజ్యాన్ని స్థాపించాలను కుంటున్న వాడికి ప్రాణాల మీద యింత తీపి పనికిరాదు," అన్నాడు ఖడ్గవర్మ.



సమరబాహు తెగింపు వచ్చినవాడిలా చేతిలోని ఈటెను పైకెత్తి ఝళిపిస్తూ, "ప్రాణాలు పోగొట్టుకుంటే యింక రాజ్యా లను జయించి, సామ్రాజ్యం స్థాపించే దేమిటి? అందుకే నా కోర్కె నెరవేరేవరకూ నేను చావదలుచుకో లేదు!" అన్నాడు.

సమరబాహు మాటలకు ఖడ్గవర్మకు పెద్దగా నవ్వాలనిపించింది. కాని, జీవ దత్తుడు కోపంగా చూడటంతో మందహాసం చేసి వూరుకున్నాడు. జీవదత్తుడు సారంగ మార్గాన ముందు బయలుదేరుతూ, "సమర బాహూ! నా చేతిలోని మంత్రదండం, ఖడ్గవర్మ కత్తి నిన్ను మా మిత్రుడైన స్వర్ణా చారి దగ్గరకు చేర్చుతాయి. అట్లని అవసరం అయితే, ఆత్మరక్షణకు నీ చేతిలోని ఈటెను ఉపయోగించటం మరిచేవు సుమా!" అని హెచ్చరించాడు.

ఆ తరవాత నలుగురూ సారంగ మార్గాన నిశ్శబ్దంగా ముందుకు నడవసాగారు. ముందుకుపోతున్న కొందికీ వాళ్ళకు తోడేళ్ల అరుపులూ, మనుషుల కేకలూ మరింత స్పష్టంగా వినబడసాగాయి. నాలుగైదు తోడేళ్ళు బిలంలో ప్రవేశించి, అంత మంది ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళను అదరగొట్టటం ఖడ్గజీవదత్తులకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

కొద్దిసేపటికల్లా వాళ్ళు సారంగమార్గంలో నుంచి బిలంలో ఎలుగ్గొడ్డు మనుషులు



నివసించే ప్రాంతాలను చేరారు. వృకేశ్వరీ దేవి కొయ్యవిగ్రహం ఉండే గదిలో గురు భల్లూకుడు వుండవచ్చునన్న అనుమానం జీవదత్తుడికి కలిగింది.

"ఖడ్గా, ఎలుగ్గొడ్డు ముఠా అంతా అరణ్యంలోకి పారిపోలేదని తెలుస్తూనే వుంది. వాళ్ళు పారిపోయి వుంటే తోడేళ్ళు యిక్కడ అరుస్తూ వుండవు గదా? మనం వాళ్ళ కంటబడకుండా బిలదుర్గం నుంచి బయటపడటం సాధ్యంకాదనుకుంటాను," అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు మాట ముగించేలోపలే ఒక ఎలుగ్గొడ్డు వాడు ప్రాణభీతితో కేకలు పెడుతూ వాళ్ళున్న వైపుకు పరిగెత్తుకుంటూ వచ్చాడు. వాడి వెనగ్గా తోడేలొకటి కోరలు చాచి, అరుస్తూవస్తున్నది. ఖడ్గవర్మ చప్పున ముందుకొక అడుగువేసి, కత్తితో తోడేలును ఒక్క పోటు పొడిచాడు. కత్తి దెబ్బ తిన్న తోడేలు కర్ణకఠోరంగా ఒకసారి అరిచి, వెనుదిరిగి, కిందపడుతూ లేస్తూ, పారిపోయింది.

తోడేలు నుంచి ప్రాణం కాపాడుకునే ప్రయత్నంలో పరిగెత్తుకొచ్చిన ఎలుగ్గొడ్డు మనిషి, ఎదురుగా ఖడ్గజీవదత్తులు నిలబడి వుండటం చూసి, భయంతో నిలువెల్లా కంపించిపోసాగాడు. జీవదత్తుడు అతణ్ణి సమీపించి, చిన్న గొంతుతో, "ఒరే, గురు భల్లూకుడి శిష్యుడా! నువ్వు దేవుడిలాగా సమయానికిక్కడ ప్రత్యక్షమయావు! ఇదంతా మీ వృకేశ్వరీదేవి మహిమ అయి వుంటుంది! సరే, నువు మాత్రం పెద్దగా గొంతెత్తి మాట్లాడక, అడిగిందానికి జవాబు చెప్పు," అన్నాడు.

"అబద్ధాలు చెప్పావో రెండుగా నరికి, తోడేళ్ళకు వేస్తాను, జాగ్రత్త!" అంటూ ఖడ్గవర్మ కత్తి పైకెత్తి ఎలుగ్గొడ్డువాడి కంఠానికి గురిచేశాడు.

"ఇప్పుడు చెప్పరా, బాబూ! మీ నాయకుడైన గురుభల్లూకుడెక్కడున్నాడు? మీ ముఠావాళ్ళంతా యింకా యీ బిలంలోనే వున్నారా, లేక బిలం వదిలి అరణ్యం

లోకి పారిపోయారా?" అని అడిగాడు జీవదత్తుడు.

"దొరల్లారా, మా వాళ్ళెవరూ బిలం వదిలి బయిటికి పారిపోలేదు. తోడేళ్ళకు భయపడి యీ ప్రాంతాలవున్న కొట్టాల్లో, గదుల్లో అందరూ దాక్కున్నట్టున్నది. గురుభల్లూకుడు, వృకేశ్వరీదేవి వున్న గదిలో ప్రార్థన చేసుకుంటున్నాడు," అన్నాడు ఎలుగ్గొడ్డువాడు.

"మనుషుల్ని పట్టుకుని బానిసల్ని చేసి, వెట్టిచాకిరీ చేయించుకునే మహావీరులు గదా, మీరు! తోడేళ్ళకు అంతగా భయపడి పోతున్నారేం?" అన్నాడు ఖడ్గవర్మ.

"మనుషుల్దే ముంది, దొరా! వాళ్ళకన్న కొంచెం బలవంతులకు యిట్టే లొంగి పోతారు. తోడేళ్ళలా కాదే; క్రూర మృగాలాయె!" అన్నాడు ఎలుగ్గొడ్డు వాడు.

వాడి మాటలకు జీవదత్తుడు నవ్వి, "పిరికి వేదాంతమైనా బహు పసందుగా చెప్పావ్‌రా! గురుభల్లూకుడు వృకేశ్వరీ కొయ్య విగ్రహం వున్న గదిలోవున్న మాట నిజమేగదా? అబద్ధం అయిందో నీకు చావు తప్పదు," అన్నాడు.

"అందులో అబద్ధ మేమీలేదు, దొరా! కావాలంటే మీరు పోయి చూడొచ్చు," అన్నాడు ఎలుగ్గొడ్డువాడు.

"అందులోవున్న నిజం ఎంతో యిప్పుడే తేలిపోతుంది. నువ్వు ముందుండి అక్కడికి దారితియ్యి. మోసం చేయాలని చూశావే, చిత్రవధ చేస్తాం!" అన్నాడు జీవదత్తుడు.





భల్లూకుడి శిష్యుడు ఖడ్గజీవదత్తుల్ని వెంటబెట్టుకుని కొంతదూరం నడిచి, ఎదురుగా వున్న ఒక గది కేసి చేయి చూపుతూ, "దొరా, అదే, వృకేశ్వరీదేవి మందిరం. గురుభల్లూకుడు లోపల వున్నాడు, చూడండి!" అన్నాడు.

ఖడ్గవర్మ నిశ్శబ్దంగా పోయి గది తలుపు మీద చేయివేసి, దాన్ని మెల్లిగా నెట్టి చూశాడు. తలుపుకు లోపల గడివేసివుండక పోవటంతో అది కొద్దిగా తెరుచుకున్నది. లోపల వృకేశ్వరీ విగ్రహానికి నాలుగైదడుగుల దూరంలో గురుభల్లూకుడు సాష్టాంగపడి, కంపిత స్వరంతో ఏదో గొణుక్కుంటున్నాడు.

ఖడ్గవర్మ సౌంజ్ఞచేసి, జీవదత్తుణ్ణి దగ్గిరకు పిలిచి, గురుభలూకుణ్ణి అతడికి చూపించి, తిరిగి ఎప్పటిలా తలుపు చేరవేసి, జీవదత్తుణ్ణి కొంచెం దూరంగా తీసుకుపోయి, "జీవా, ఏమిటి నీ ఆలోచన? గురుభల్లూకుణ్ణి యిక్కడే కత్తికి ఎర చేద్దామంటావా?" అని అడిగాడు.

జీవదత్తుడు ఒకటి రెండు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత ఏదో మంచి ఆలోచన వచ్చినవాడిలా తలపంకిస్తూ, "ఖడ్గా, ఈ గురుభలూకుణ్ణి చంపి మనం కొత్తగా సాధించబోయే దేమీలేదు. వీడితో పాటు వీడి శిష్యుల్ని కొందర్ని చంపి, అనవసర రక్తపాతం కలిగించటం ఎందుకు? వాడు విగ్రహం ముందు సాష్టాంగపడి వున్నాడు గనక, నువ్వు నిశ్శబ్దంగా విగ్రహం వెనక్కు పోయి, వృకేశ్వరీదేవే మాట్టాడుతున్నట్టు నటించి, గురుభల్లూకుణ్ణీ, వాడి శిష్యుల్నీ, యీ బిలదుర్గం వదిలి పారిపొమ్మని హెచ్చరిక చెయ్యి," అన్నాడు.

"ఊరికే అలా పారి పొమ్మంటే వాడు పారిపోతాడా?" అని ఖడ్గవర్మ కొంచెంసేపు వూరుకుని, "నువ్వు చెప్పమన్న దానికి కాస్త కలిపి చెబుతాను. ఒక వేళ వాడు ఆ మాట్టాడేది వృకేశ్వరీదేవి కాదని గ్రహించి, నా మీదికి వచ్చాడో — కత్తితో రెండుగా నరుకుతాను," అన్నాడు.

"ఏదో ఒకటి తొందరగా కానియ్యి. వాడి సాష్టాంగ భక్తి ముగిసి, లేచి కూర్చున్నాడో, మన ఉపాయం ఏమీ పారదు," అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ పిల్లిలాగా గదిలో ప్రవేశించి, వృకేశ్వరీ విగ్రహం వెనకకూర్చుని, పెద్ద గొంతుతో, "గురుభల్లూకా, నీ భక్తికి మెచ్చాను. దైవద్రోహులు ప్రవేశించటంతో, ఈ బిలదుర్గం అపవిత్రమై పోయింది. నేను ఇప్పుడే 'యిక్కడ అంతర్థానమై, యిక్కడికి తూర్పు వైపున అరణ్యంలోని కొలను గట్టున వున్న జమ్మిచెట్టు కింద ప్రత్యక్షం కాబోతున్నాను. నువ్వు శిష్యగణంతో ఆ కొలనులో శుచివై వచ్చి, నన్ను పూజించు!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే గురుభల్లూకుడు అదిరిపడి లేచి నిలబడ్డాడు. వాడు విగ్రహం కేసి ఎంతో భక్తి పుట్టిపడేలా ఒకటి రెండు క్షణాలు చూసి, చేతులు జోడించి, "అమ్మా!" అంటూ ఏమో చెప్పబోయేంతలో, ఖడ్గవర్మ గట్టిగా కసురుతూ, "ఒరే, మాట్లాడకు! తిరిగి చూడకుండా, నీ శిష్యగణంతో అరణ్యంలోని కొలను గట్టుకురా!" అన్నాడు.

గురుభల్లూకుడు చెంపలు వేసుకుని, విగ్రహానికి మోకరిల్లి దణ్ణం పెట్టి, లేచి గది నుంచి బయిటికి వచ్చాడు. వాడు బయిటికి వచ్చేంతలో జీవదత్తుడూ, అతడి వెంట వున్న వాళ్ళూ, దూరంగా పోయి గోడ అవతల దాక్కున్నారు.



గురుభల్లూకుడికి వృకేశ్వరీదేవి స్వయంగా తనతో మాట్టాడిందన్న భ్రమలో ఎక్కడ లేని ధైర్యం కలిగింది. వాడు పంచ శూలాన్ని పైకెత్తి, "ఒరే, వృకేశ్వరీ భక్తుల్లారా! అంతా వెంటనే బయలుదేరి అరణ్యంలోని కొలను దగ్గరకు చేరండి! దేవి ఆజ్ఞ అయింది!" అంటూ బిల దుర్గంలో కేకలు పెడుతూ తిరగసాగాడు.

ఒక పావు గంట గడిచీ గడవక ముందే, తోడేళ్ళకు భయపడి అక్కడా యిక్కడా దాక్కున్న వాడి శిష్యులందరూ జట్లు జట్లుగా బిలంలో నుంచి బయిటికి వెళ్ళారు. తోడేళ్ళు మాత్రం యింకా బిలంలోని ఏ మారు మూలల్లోనో తిరుగుతూ అరుస్తూ నేవున్నవి.

గురుభల్లూకుడు కూడా బిలంలో నుంచి బయిటికి వచ్చి తన శిష్యులకు వృకేశ్వరీ ఆజ్ఞ ఏమిటో మరొకసారి చెప్పి, వాళ్ళతో పాటు అరణ్యం కేసి బయలుదేరాడు. కాని, వాడికి కొంత దూరం వెళ్ళిం తర వాత, వృకేశ్వరి యింకా బిలంలోని తన మందిరంలో వున్నదో లేక మాయమై పోయిందో చూడాలనిపించింది. వాడికి ఆ క్షణంలో పట్టిన మూఢభక్తిలో, బిలంలో తన శత్రువులైన ఖడ్గ జీవదత్తులూ, సమర బాహూ వుండవచ్చన్న ఆలోచనే కలగలేదు...

గురుభల్లూకుడు బిలాన్ని సమీపిస్తున్న సమయంలో, ఖడ్గ జీవదత్తులు లోపల వున్న తోడేళ్ళను వెతికి, కొట్టి బయిటికి తరిమేస్తున్నారు. వాళ్ళ చేతుల్లో ఎదురు తిరిగిన ఒక తోడేలు మాత్రమే చచ్చింది. మిగతా తోడేళ్ళు బిలంలో నుంచి బయిటికి పారిపోసాగినై. వాటికి సమయానికి బిలం పైన గురుభల్లూకుడు కనిపించాడు. వెంటనే అవి పెద్దగా మొరుగుతూ అతడి కేసి పరిగెత్తినై.

గురుభల్లూకుడు ఆ తోడేళ్ళను చూసి నిలువెల్లా కంపించిపోయి, వెనక్కు తిరిగి తన శిష్యుల కేసి పరిగెత్తుతూ, "వృకేశ్వరీ మాతా, రక్షించు!" అంటూ అరవసాగాడు.

—(ఇంకావుంది)





# విలు విద్యా ప్రదర్శనం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నువు పడే ఈ శ్రమను మరొకడికి మార్చవలసి వస్తే అలాటి మనిషిని వెతకటం ఎంతో కష్ట సాధ్యమనుకుంటాను. వెనకటికి చతురసేన మహారాజుకు కొత్త అంగరక్షకుణ్ణి కుదుర్చు కోవటమే ఎంతో కష్టమయింది. శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఆ కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

చతురంగపురాన్ని ఏలే చతురసేనమహా రాజుకు ఆనందుడు అనే అంగరక్షకుడు ఉండేవాడు. అలాటి అంగరక్షకుడు ఏ రాజుకూ దొరకడన్నమాట. ఆనందుడు చతురసేనుణ్ణి అనేక పర్యాయాలు అనేక

## బేతాళ కథలు




అంగరక్షకుడు ఎలా దొరుకుతాడా అన్న సమస్య నన్ను బాధిస్తున్నది." అన్నాడు.

ఆనందుడి రాజభక్తి చతురసేనుడికి బాగా తెలుసును. దేశంలో రాజకీయపరిస్థితి అంత బాగా లేదు. అందుచేత ఆయనకు ఆనందుడి లాగా సమర్థుడైన అంగరక్షకుడు నిజంగా అవసరమే.

"ఈ సమస్య గురించి నువు బాధపడకు. నాకు కొత్త అంగరక్షకుణ్ణి చూసే బాధ్యత సేనాపతిదీ, మంత్రి దీనూ." అన్నాడు చతురసేనుడు ఆనందుడితో.

"అలా కాదు, మహారాజా. నా కొక ఆలోచన తట్టింది. మీకు నచ్చితే నేను చెప్పిన ప్రకారం చెయ్యండి. మీకు సుధన్వుడి పేరు తెలిసే ఉంటుంది. మన రాజ్యంలో అతన్ని మించిన విలుకాడు లేడు. ఆయన మాకు దూరపు బంధువు. ఒక్కసారి ఆయనచేత విలువిద్యా ప్రదర్శనం ఏర్పాటు చేయండి. నేను కోరితే ఆయన అంగీకరించి మనకు సహాయపడతాడు," అన్నాడు ఆనందుడు.

రాజధానికి వచ్చి మహారాజును కలుసుకోవలసిందని సుధన్వుడికి పిలుపు వెళ్ళింది. ఆనందుడు కూడా విడిగా ఆయనకు కబురు పంపాడు. తనను చూడవచ్చిన సుధన్వుడితో చతురసేనుడు విలువిద్యా ప్రదర్శనం ఇయ్యమన్నాడు.

రకాల ఆపదల నుంచి కాపాడాడు. అతను పక్కన ఉండగా రాజు మీద ఈగ కూడా వాలటానికి సాహసించదని చెప్పవచ్చు.

అలాటి ఆనందుడికి అకస్మికంగా ఏదో జబ్బు చేసి చెయ్యి పడిపోయింది. రాజవైద్యులు ఎన్ని చికిత్సలు చేసినా ఆ చేతికి పూర్వపు దార్ఢ్యం తిరిగి రాలేదు. అతను బతికి ఉన్నంతకాలమూ అంతో యింతో అవిటిగానే ఉండిపోయేటట్టు కనిపించింది.

అప్పుడు ఆనందుడు రాజుతో, "మహారాజా, నేను మీ వెంట ఉన్నంతకాలమూ మీరు మీ విషయం ఆలోచించుకో నవసరం లేకపోయింది. నాకు ఇప్పుడు నన్ను గురించి విచారం లేదు గాని, మీకు మరో సమర్థుడైన

"మహారాజా, నాకు వయసు పైన పడు తున్నది. ఈ నాడు నేను చేసే ప్రదర్శనం ఎవరికీ అంత రక్తిగా ఉండక పోవచ్చు." అన్నాడు సుధన్వుడు.

కాని రాజు బలవంతం మీద సుధన్వుడు ప్రదర్శన ఇయ్యటానికి అంగీకరించాడు.

సుధన్వుడు ప్రదర్శన చూడవచ్చిన వారిని ఉద్దేశించి, "ఎవరైనా ధైర్యశాలి నెత్తిన పండు పెట్టుకుని నిలబడితే నేను యాభైబారల దూరంనుంచి ఆ పండును కొడతాను. సాహసం ఉన్నవాళ్ళు ముందుకు రండి," అన్నాడు.

సుధన్వుడి కీర్తి వినని వాళ్ళులేరు. అందుచేత పది, పన్నెండు మంది యువకులు ముందుకు వచ్చారు.

సుధన్వుడు వారితో, "మీకు నాలో ఎంతో నమ్మక మున్నట్టు గ్రహించాను. అయితే మీలో ఎవరూ నా విద్యచూసి ఉండరు; ఏనాడో నేను సంపాదించుకున్న కీర్తి విని ఉంటారు. ఇటీవల నా గురి ఎలా ఉన్నదీ నాకే తెలీదు. అందుచేత ఒకటి రెండు బాణప్రయోగాలు చేసి తరవాత అసలు ప్రదర్శనకు వస్తాను," అన్నాడు.

సుధన్వుడి కోరికపై మహారాజు ఒక పళ్ళెం తెప్పించి, అందులో ఒక వెండి గిన్నె, ఒక బంగారుగిన్నె మూతలతో సహ పెట్టించాడు.



సుధన్వుడు విల్లూ, బాణమూ తీసుకుని దూరంగా నిలబడి, "వెండిగిన్నె మీది మూత కొట్టటానికి ప్రయత్నిస్తాను." అంటూ బాణం గురిచూసి వదిలాడు. బంగారు గిన్నె మీది మూత ఎగిరిపోయింది. ప్రేక్షకులు అతని ఓటమికి ఆశ్చర్యపోయారు.

తరవాత సుధన్వుడు మరొక ప్రయత్నం చేశాడు. అతను రెండు గంగాళాలు తెప్పించి, ఒకదానిలో పన్నీరూ, రెండవ దానిలో మంచినీరూ పోయించాడు; రెండు బాణాలు తీసుకుని దూరంగా నిలబడి, "ఇప్పుడు నేను ఒక బాణంతో పన్నీటి గంగాళానికి చిల్లిపెట్టి, రెండవ బాణం ఆ చిల్లిలో ఇరుక్కునేటట్టు చేస్తాను," అన్నాడు.



అతను వేసిన మొదటి బాణం పన్నీటి గంగాళానికి కాక, మంచి నీటి గంగాళానికి తగిలి చిల్లిపెట్టింది. అందులో నుంచి నీరు కారసాగింది. అతని రెండో బాణం ఆ చిల్లి లోనే ఇరుక్కుని, కారే నీటిని ఆపేసింది.

సుధన్వుడు యువకులతో, "చూశారు గదా? నా మనస్సు సరిగాలేదు. నా గురి కూడా సరిగా లేదు. మీలో ఎవరు పండు నెత్తిన పెట్టుకుంటారు? అన్నాడు.

యువకు లందరూ వెనక్కు తగ్గారు. ఒక్కడు మాత్రం ముందుకు వచ్చి, "నేను సిద్ధంగా ఉన్నాను," అన్నాడు.

మహారాజుకు సమీపంలోనే ఉండి అంతా చూస్తున్న ఆనందుడు రహస్యంగా, "మహారాజా, వాడే తమకు అంగరక్షకుడు కాబోతున్నవాడు," అన్నాడు.

అలా ముందుకు వచ్చిన యువకుడు కొంతదూరం వెనక్కు వెళ్ళి, నెత్తిన పండు పెట్టుకుని నిలబడ్డాడు. సుధన్వుడు తాను కూడా చాలాదూరం వెనక్కు వెళ్ళి విల్లుకు బాణం సంధించాడు. యువకుడి ముఖంలో భయం ఏమీ కనిపించలేదు, ప్రేక్షకులు మాత్రం భయభ్రాంతులై చూస్తున్నారు. సుధన్వుడికీ ఆ యువకుడికీ మధ్య డెబ్భై బారల దూరం ఉన్నది.

అయినా సుధన్వుడు చెవి దాకా లాగి వదిలిన బాణం ఆ యువకుడి నెత్తి మీది పండును ఎగరగొట్టుకు పోయింది. యువకుడు ఏ మాత్రమూ చెక్కు చెదరలేదు. మహారాజు ఆ యువకుణ్ణి అభినందించి, అతన్ని తన కొత్త అంగరక్షకుడుగా నియమించుకున్నాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకు కొన్ని సందేహాలున్నాయి. రాజుగారికి అంగరక్షకుడు కావలిసి ఉండగా ఆనందుడు విలువిద్యాప్రదర్శనం ఎందుకు పెట్టాడు? అందుకు రాజు ఏమని సమ్మతించాడు? సుధన్వుడు తన గురి సరిగాలేదని తెలుసుకున్నాక ప్రదర్శన మానేసి ఇంటికి పోక, ఆ యువకుడికి లేని పోని ప్రాణసంకటం ఎందుకు తెచ్చిపెట్టాడు? అందరూ బుద్ధిగా

వెనక్కు తప్పుకుంటే వాడు మొండి ధైర్యంతో ఎలా ముందుకు వచ్చాడు? వాణ్ణి రాజు తన అంగరక్షకుడుగా పెట్టుకోవచ్చు నని ఆనందుడు ఏమని సలహా ఇచ్చాడు? ఈ అనుమానాలన్నిటికీ తెలిసి కూడా సమాధానం చెప్పక పోయావో నీ తలపగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజుకు తన స్థానంలో మంచి అంగరక్షకుణ్ణి ఏర్పాటు చెయ్యాలన్న చింత రాజును బాధించిన దానికన్న ఆనందుణ్ణి ఎక్కువగా బాధించింది. అందుకోసం ఆనందుడు విలువిద్యా ప్రదర్శనం పెట్టుదామంటే అదే సరి అయిన పద్ధతి కాబోలు నని రాజు అనుకున్నాడు. రాజుకు వాడి యందు సంపూర్ణమైన విశ్వాసం ఉన్నది. నాట్యప్రదర్శనం పెట్టుదామని ఆనందుడు అని ఉండినా రాజు సరే ననేవాడే. పోతే, సుధన్వుడు తనకు గురి సరిగా లేనట్టు నటించటం అంగరక్షకుడి పరీక్షలో ఒక భాగం. ఎంతో గురికలవాడైతే తప్ప సుధన్వుడిలాగా గురి తప్పడు. అదీగాక ప్రసిద్ధుడైన విలుకాడు ఆత్మవిశ్వాసం పూర్తిగా ఉంటేనే గాని ఇతరుడికి ప్రమాదం కలిగే ప్రదర్శన ఇయ్యడు. తాను జయప్రదంగా ప్రదర్శన ఇయ్యగలనన్న ధైర్యం ఉండబట్టే సుధన్వుడు ఇంటికి పోలేదు. నిజమైన ధైర్యమూ, విచక్షణా జ్ఞానమూ లేకుండానే తన గురిలో నమ్మకం మాత్రం ఉండి ముందుకు వచ్చిన యువకులను సుధన్వుడు బెదరగొట్ట యత్నించాడు. వాళ్ళు బెదిరారు. అలా బెదరని వాడు ధైర్యంతోబాటు విచక్షణాజ్ఞానం గలవాడు. సుధన్వుడి గురి శుద్ధంగా ఉన్నదని వాడు గ్రహించి ముందుకు వచ్చాడు. వాడిది మొండి ధైర్యం కాదు. అలాటి వాడే అంగరక్షకుడుగా పనికి వస్తాడని ఆనందుడు మొదటి నుంచీ నమ్మాడు. రాజు వాణ్ణే తన అంగరక్షకుడుగా వేసుకున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# దొంగసన్యాసి

పూర్వం ఒక నగరంలోకి ఒక దొంగసన్యాసి తన శిష్యులతో సహా వచ్చి, "చచ్చిపోయి నరకంలో ఉన్న వారిని స్వర్గానికి పంపిస్తాను," అని ప్రచారం చేశాడు.

అమాయకులైన ప్రజలు కొందరు ఆ సన్యాసి మాటలు నమ్మి, అతనికి డబ్బు ఇచ్చి, తమ పెద్దలను స్వర్గానికి పంపే ప్రక్రియలు చేయమని అతన్ని బతిమాలుకున్నారు.

ఆ నగరపు రాజుకు ఈ సంగతి తెలిసింది. ఆయన తన ప్రజల అమాయకత్వానికి విచారించి, వారికి జ్ఞానోదయం కలిగించాలని, తన భటులను పంపి ఆ దొంగసన్యాసిని చెరలో పెట్టించాడు.

ఈ సంగతి తెలిసి ఆ దొంగసన్యాసి భక్తులు కొందరు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహా రాజా, ఆ మహాత్ముణ్ణి ఖైదులో ఉంచటం చాలా తప్పు. ఆయనను వెంటనే విడుదల చెయ్యండి," అని ప్రాధేయపడ్డారు.

"చచ్చిపోయిన వారిని నరకం నుంచి విడిపించి స్వర్గానికి పంపే శక్తి గలవాడు, కటకటాల నుంచి బయటికి రాలేడా ?" అని రాజు వారితో అన్నాడు.

అంతటితో ప్రజలకు దొంగసన్యాసి మీద విశ్వాసం పోయింది.

—లలిత & రమణ. కె.





# సొంత కల

ఒక తిరునాళ్ళలో భార్యా భర్తలు స్నానం చేస్తూ నదీ తీర్థంలో మొసలివాత పడ్డారు. వారి కొడుకు రాముడనే వాడు, అయిదేళ్ళ కుర్రవాడు, అనాథుడై ఏడుస్తూ జనం మధ్య తిరుగుతూంటే సిద్ధయ్య అనే పశువుల కాపరి చూసి, సంగతి తెలుసుకుని, కుర్రవాణ్ణి ఓదార్చి, తన ఇంటికి తీసుకుపోయి పెంచుకున్నాడు.

రాముడు చురుకైన వాడు, సిద్ధయ్యకు అన్ని పనులలోనూ సహాయపడుతూ ఉండే వాడు. వాడికి జన్మతః మంచి శ్రావ్యమైన కంఠం ఉన్నది. వాడు గొంతెత్తి పాడితే పశువులు కూడా తలలెత్తి ఆలకించేవి.

రాముడిలో అద్భుతమైన ఇంకొక విశేషం కనబడింది. వాడికి వచ్చే కలలు నిజమవుతూ వచ్చాయి.

ఒక నాడు వాడు సిద్ధయ్యతో, "నాకు రాత్రి ఒక కల వచ్చింది. మీరు కొండవార ఒక చెట్టు కింద కూర్చుని ఉండగా, ఒక నల్ల పక్షి మీ ముందు వాలి, నేలలో పొడిచిందట. మీరు ఆ స్థలంలో తవ్వేసరికి ధనపు బిందె దొరికిందట," అన్నాడు.

సిద్ధయ్య ఈ కలను గురించి పట్టించుకోలేదు. కాని వారం రోజుల అవతల రాముడు కలగన్న దంతా అక్షరాలా జరిగింది; సిద్ధయ్యకు ధనం ఉన్న బిందె దొరకనే దొరికింది.

ఇలాగే రెండు మూడు సార్లు రాముడికి కలలు రావటమూ, అవి నిజం కావటమూ జరిగింది. అందుచేత సిద్ధయ్య ప్రతి ఉదయమూ రాముడికి వచ్చిన కలలను గురించి అడుగుతూండే వాడు.

ఒక ఉదయం రాముడు నిద్రలేచి, "భలే కల!" అన్నాడు.

"ఏమిట్రా ఆ కల?" అని సిద్ధయ్య అడిగాడు.

ఆర్. రామరాజు



"అది నా సొంతకల లెండి," అని రాముడు ఆ కల గురించి చెప్ప నిరాకరించాడు. సిద్ధయ్య ఎంత బతిమాలినా రాముడు ఆ కల గురించి చెప్పలేదు. సిద్ధయ్యకు కోపంవచ్చి, రాముణ్ణి తన ఇంటి నుంచి తరిమేశాడు.

రాముడు అక్కడి నుంచి ఉత్తర దిక్కుగా పోయి, రెండు, మూడు గ్రామాలు దాటి, ఒక చెరువు వద్దకు వచ్చాడు. ఆ చెరువు గట్టుమీద ఒక బొద్దుమీసాల ఆసామీ నిలబడి, ఏదో ఆలోచిస్తున్నాడు.

రాముడు ఆ ఆసామీకి దణ్ణంపెట్టి, "అయ్యా, నేను అనాధుణ్ణి. నన్ను పనిలో పెట్టుకోండి. నాకు కూడూ, గుడ్డా ఇస్తే చాలు. వ్యవసాయం పనులన్నీ చేస్తాను," అన్నాడు.

ఆ పెద్దమనిషి రాముడి కేసి పరీక్షగా చూసి, "ఎక్కడైనా పొలం దున్నేవాణ్ణి చూసి, వాడికి తెలియకుండా వాడి ఎడ్లను దొంగిలించి తెస్తే పనిఇస్తాను," అన్నాడు.

రాముడు సరేనని కొంతదూరం వెళ్ళి, అడవికి సమీపంలో ఒంటరిగా పొలం దున్నుకుంటున్న రైతును ఒకణ్ణి చూశాడు. వాడు అడవిలోకి వెళ్ళి, పొలం దున్నే మనిషి తనకు కనిపించేటట్టుగా చెట్ల వెనక దాక్కుని, గొంతెత్తి శ్రావ్యంగా పాడసాగాడు. ఆ పాట విని ఎడ్లూ, రైతూకూడా పనిమానేసి అడవి కేసి చూశారు.

రైతు ఆ పాడేవాణ్ణి చూడాలని ఎడ్లను పొలంలోనే వదిలి అడవిలోకి ప్రవేశించాడు. రాముడు రైతు కంట పడకుండా, పొదల చాటుగా చాలా దూరం పాడుతూ పోయి, పాట ఆపి, రహస్యంగా పొలానికి తిరిగి వచ్చి, ఎడ్లను విప్పి, తోలుకు పోయాడు. రైతు పాట ఆగిపోయిన ప్రాంతంలో చాలా సేపు వెతికి, ప్రాణం విసిగి తన పొలానికి తిరిగి వచ్చేసరికి కనుచూపు మేరలో ఎక్కడా ఎడ్లులేవు.

రాముణ్ణి ఎడ్లు దొంగిలించుకు రమ్మని పంపిన పెద్దమనిషి కావటానికి వ్యవసాయదారుడేగాని, పశువుల దొంగవ్యాపారం

కూడా చేసేవాడు. ఆయన రాముణ్ణి పనికి పెట్టుకున్నాడు.

కొంతకాలం గడిచాక ఈ పశువుల దొంగ వ్యాపారి దగ్గిరికి పశువుల బేరం మీద సిద్ధయ్య వచ్చి, రాముణ్ణి చూసి గుర్తుపట్టి, "ఓరీ, నువు ఇక్కడ చేరావా?" అని అడిగాడు.

"వీణ్ణి నువు ఎరుగుదువా?" అని బొద్దు మీసాలవాడు సిద్ధయ్యను అడిగాడు.

"వీడు మా ఇంట్లోనే పెరిగాడు. వీడికి చిత్రమైన కలలు వచ్చేవి. అవి నిజం అయేవి. చివరకు ఒక కలవస్తే అది ఏమిటో చెప్పాడు కాడు, వెధవ. వాడి కలల వల్ల నాకు చాలా లాభం కలిగింది. మీకు కూడా లాభం కలిగే ఉండాలే?" అన్నాడు సిద్ధయ్య.

బొద్దుమీసాలవాడు, "లేదే!" అని రాముడితో, "ఒరే, నీకు మా ఇంట ఏమేం కలలు వచ్చాయి?" అన్నాడు.

తనకు కలలేమీ రాలేదన్నాడు రాముడు.

"దొంగవెధవా! నా ఇంట తిని, నా ఇంట కలలు గని, నాకు చెప్పకుండా, లాభమంతా దాచుకుంటున్నావా?" అంటూ మీసాల పెద్దమనిషి రాముణ్ణి పట్టుకుని కట్ట బోయాడు. కాని రాముడు తప్పించుకుని పారిపోయి, మరొక గ్రామం చేరాడు.

ఒక చోట ఒక ధనికుడూ, ఆయన బండి వాడూ గుర్రాలను బేరమాడుతున్నారు.




అక్కడే కొత్తగా తయారైన, అందమైన గుర్రపుబండీ ఉన్నది. వాళ్ళకు ఒక ఆడ గుర్రం నచ్చింది.

గుర్రాలు అమ్మేవాడు మరొక ఆడ గుర్రాన్ని కూడా చూపించి, "ఇవి రెండూ తల్లీ కూతుళ్ళు. ఏది తల్లో, ఏది కూతురో కనుక్కోగలరా?" అన్నాడు.

రెండూ చూడటానికి కవల గుర్రాలలాగా ఉన్నాయి. ధనికుడికి గాని, బండివాడికి గాని వాటి వయసులో వ్యత్యాసం తెలియలేదు.

"నేను చెబుతాను ఉండండి," అని రాముడు, ఎగుడు దిగుడుగా ఉన్న ప్రాంతంలో అక్కడక్కడా మంటలు పెట్టి,

రెండు గుర్రాలనూ తోలాడు. ఒక గుర్రం ధైర్యంగా మంటల మధ్యగా దారి చూసు కుంటూ వెళ్ళింది. రెండోది గుంటలలో నీరూ, అక్కడక్కడా మంటలూ చూసి వెనక్కు తిరిగింది. మొదటిది తల్లి అనీ, రెండోది పిల్ల అనీ రాముడు నిర్ణయించాడు.

ధనికుడు రాముడి తెలివికి సంతోషించి, రెండు గుర్రాలనూ కొని, "నువు బండిలో మా ఇంటికి వచ్చి, బహుమానం ఏదన్నా పుచ్చుకుని మరీ వెళ్ళు," అని రాముడితో అన్నాడు.

"దిక్కులేని వాణ్ణి, ఎక్కడికి వెళతాను? పని ఏదన్నా ఇచ్చి, నన్ను మీ యింటనే ఉంచుకోండి," అన్నాడు రాముడు.

ధనికుడు రాముణ్ణి బండీలో తన ఇంటికి తీసుకుపోయాడు. ధనికుడి కూతురు రత్నావతి రాముడి కేసి తేరిపార చూడసాగింది.

"ఏమమ్మా, అలా చూస్తున్నావు?" అని ధనికుడు కూతుర్ని అడిగాడు.

"ఈ రెండు గుర్రాలనూ ఇతను పరిగెత్తించాడా?" అని ఆమె తండ్రిని అడిగింది.

"అవునమ్మా, పరిగెత్తించాడు!" అన్నాడు ధనికుడు.

"నువు పాట పాడి రెండు ఎడ్లను దొంగిలించావా?" అని ఆమె రాముణ్ణి అడిగింది.

"ఔను, దొంగిలించాను. కాని నేను దొంగను కాను," అన్నాడు రాముడు.

"నువు ఒకసారి నన్ను చూసి, అనంతరం పారిపోయావు గదా?" అని ఆమె మళ్ళీ అడిగింది.

"ఔను. నిన్ను చూసిన సంగతి చెప్పక పోయేసరికి సిద్ధయ్య నన్ను తరిమేశాడు," అన్నాడు రాముడు.

రత్నావతికి పెళ్ళియీడు వచ్చి కొంత కాలమయింది. తండ్రి ఎన్ని సంబంధాలు చూసినా ఆమె ఒప్పుకోక, "నన్ను చేసుకునేవాడు మీ వెంట ఒకనాడు మన ఇంటికే వస్తాడు," అంటూ వచ్చింది.

ఆ మాట ఇప్పుడు కుమార్తె జ్ఞాపకం చేసేసరికి, ధనికుడు సంతోషించి వారిద్దరికీ పెళ్ళి చేసి, రాముణ్ణి తన వద్దనే ఉంచుకున్నాడు.





ఒక ఊళ్ళో రోశయ్య అనే కోళ్ళవ్యాపారస్థుడు ఉండేవాడు. వాడు పచ్చి మోసకారి. వాడి వద్ద కొన్ని మచ్చిక అయిన కోళ్ళు ఉండేవి. వాడు రోజూ వాటికి సరిపోయినన్ని చేపలు మేపి, మరికొన్ని ఎండు చేపలు తాడుకు గుచ్చి వాటి మెడలలో హారాలుగా వేసి, ఊరిమీదికి పంపేవాడు. ఆ ఎండు చేపల కోసం ఊరి కోళ్ళు వాటి వెంటబడి, రోశయ్య ఇల్లు చేరేవి. అలా తన ఇంటికి చేరిన ఊరి కోళ్ళ ఈకలకు రంగులు వేసి వాటి తాలూకు మనుషులు వాటిని గుర్తు పట్టకుండా చేసి, అమ్మి డబ్బు చేసుకునేవాడు రోశయ్య. గ్రామంలో కోళ్ళు ఎలా మాయమవుతున్నాయో, ఎక్కడికి పోతున్నాయో అందరికీ అంతుబట్టని సమస్యగా ఉండేది.

ఆ ఊళ్ళోనే చిన్నడు అనే ఒక విచిత్ర వ్యక్తి ఉండేవాడు. వాడి వెంట ఒక పిల్లీ, రెండు కోడిపుంజులూ ఉండేవి. అవే వాడి పంచప్రాణాలు. చిన్నడికి వేట తప్ప మరో ధ్యాస లేదు. ఊళ్ళో కోళ్ళు చిత్రంగా మాయమవుతున్నాయని విని కూడా వాడు అంతగా పట్టించుకోలేదు.

ఉన్నట్టుండి చిన్నడి కోడిపుంజులు రెండూ మాయమయ్యాయి. వాటి కోసం చిన్నడు పసి పిల్లాడులా ఏడ్చాడు. తరవాత వాడికి కోళ్ళ దొంగను పట్టుకోవాలన్న పంతం పుట్టుకొచ్చింది. ఆ రోజు మొదలుకొని వాడు వీధుల్లో తిరుగుతూ కోళ్ళను పరీక్షించసాగాడు.

ఒక చోట చిన్నడికి ఒక వింత కనిపించింది. ఒక కోడి ముందు పరిగెట్టుతున్నది. మరికొన్ని కోళ్ళు దాన్ని అనుసరిస్తున్నాయి. చిన్నడు వాటి వెంట కొంతదూరం వెళ్ళి, ముందుపోయే కోడి మెడలో ఎండు చేపల హారం ఉన్నదనీ, ఆ చేపల కోసం మిగిలిన

బూర్లె నాగేశ్వరరావు



కోళ్ళు పోతున్నాయనీ కనిపెట్టాడు. కోడి మెడలోకి ఎండు చేపలహారం ఎలావచ్చింది? కొంచెం ఆలోచిస్తే, ఇది ఎవరో బుద్ధి పూర్వకంగా చేస్తున్న పనిలాగా ఉన్నది.

ముందు కోడి తిన్నగా రోశయ్య ఇంటికి వెళ్ళింది. మిగిలిన కోళ్ళు కూడా ఆ ఇంట్లోకి వెళ్ళాయి.

చిన్నడికి ఇప్పుడు అంతా అర్థమయింది. వాడు తాను చెయ్యవలిసినది నిర్ణయించుకుని, ఇంటికి పోయి, తప్ప తాగినవాడిలాగా వేషం మార్చుకుని, తూలుతూ రోశయ్య ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో రోశయ్య తీరిగ్గా కూచుని కోళ్ళకు రంగులు పూస్తున్నాడు.

చిన్నడు తన చేతిలోని సారా సీసాను ఊపుతూ, "చూడు, బాబాయ్! నువు చేస్తున్నది చాలా తప్పు! ఈకలు కత్తిరిస్తే చాలు, ఎవరూ గుర్తించరు," అన్నాడు, మైకంలో ఉన్నవాడిలాగా.

చిన్నడు ఇలా అనగానే రోశయ్య గుండె దడదడలాడింది.

"అబ్బే, అదేం లేదు. కాస్త ధర పలుకుతుందని రంగులు వేస్తున్నాను. అంతే! అది సరేగాని, ఏదో పని మీద వచ్చినట్టున్నావు?" అన్నాడతను.

"మరేమీ లేదు. ఈ రోజు వేట సాగలేదు. మాంసం లేనిదే మనకు జరగదుగా? మంచి కోడిపుంజులుంటే చూడు," అన్నాడు చిన్నడు.

"ఓ, దానికేం? నిన్ననేగా సరుకు దిగిందీ?" అన్నాడు రోశయ్య.

"అయితే చూడనీ," అంటూ చిన్నడు లోపలికి వెళ్ళాడు.

లోపల రంగురంగుల కోళ్ళు బోలెడున్నాయి. వాటిలో తన పుంజులు కూడా ఉన్నప్పటికీ వాటిని గుర్తించటం తేలిక కాదు. చిన్నడు మెల్లిగా తన భాషలో పిలిచే సరికి, రెండు కోడిపుంజులూ అరుచుకుంటూ వాడి కేసి వచ్చాయి.

ఒక్క క్షణం చిన్నడి కళ్ళు మెరిశాయి. కాని మరుక్షణం, "ఛాత్, ఇలాటి నాటు

కోళ్ళు నేను ముట్టను," అంటూ వాడు అక్కడి నుంచి బయటికి వెళ్ళిపోయాడు.

వాడు వెళ్ళిపోగానే రోశయ్య సుఖంగా శ్వాస తీసుకున్నాడు. చిన్నడు మైకంలో ఉన్నాడు గనక తన రహస్యం బయట పడదని వాడికి ధైర్యం కలిగింది.

మర్నాడు చిన్నడు తన పిల్లితో సహా రోశయ్య ఇంటికి కొంతదూరంలో మాటు వేశాడు. రోశయ్య యథాప్రకారం కోళ్ళ మెళ్ళలో చేపల దండలు వేసి ఊరి మీదికి వదిలాడు. రోశయ్య చూస్తూండగానే చిన్నడు తన పిల్లిని ఆ కోళ్ళ మీదికి ఉసికొల్పాడు. పిల్లి వెంటనే రోశయ్య కోళ్ళ గొంతులు కొరికి చంపేసింది.

అది చూసి రోశయ్య మండిపడి, న్యాయాధికారి వద్దకు వెళ్ళి, తన కోళ్ళను చిన్నడు వాడి పిల్లి చేత చంపించాడనీ, చాలా కాలంగా ఊళ్ళో కోళ్ళు మాయం అవుతూ ఉండటానికి వాడే కారణమనీ ఫిర్యాదు చేశాడు.

న్యాయాధికారి చిన్నణ్ణి పిలిపించి, "ఏమయ్యా, ఊళ్ళో కోళ్ళను నీ పిల్లి చేత చంపిస్తున్నావట?" అని అడిగాడు.

"అయ్యా, ఇది చాలా అన్యాయం. నా పిల్లి కోళ్ళను ఏనాడూ చంపి ఎరగదు. అది అసలు ఎండు చేపలను తప్ప మరి ఏ మాంసమూ ముట్టదు," అన్నాడు చిన్నడు.



"అయితే, ఇంకేం? నా కోళ్ళ మెళ్ళో ఎండుచేపలున్నాయి. నీ పిల్లి నా కోళ్ళను చంపిన మాట అబద్ధం కాదు." అన్నాడు రోశయ్య.

న్యాయాధికారి విస్మయంతో, "అదేమిటి? నీ కోళ్ళ మెడలో ఎండు చేపలు ఎందు కున్నాయి?" అని రోశయ్య కేసి తీక్ష్ణంగా చూస్తూ అడిగాడు.

నోరుజారి ఎండుచేపల సంగతి బయట పెట్టినందుకు రోశయ్య తత్తరపడ్డాడు.

అప్పుడు చిన్నడు న్యాయాధికారితో, "బాబూ, అందులోనే ఉన్నది కిటుకంతా, ఊళ్ళో కోళ్ళు మాయం కావటానికీ, రోశయ్యకూ దగ్గిర సంబంధం ఉన్నది. ఈయన

గారు తన కోళ్ళ మెడలకు ఎండు చేపల దండలు తగిలించి ఊళ్లోకి పంపిస్తాడు. ఆ చేపల మీది ఆశకొద్దీ ఊళ్లో కోళ్ళు వాటి వెంటబడి రోశయ్య ఇంటికి వస్తాయి. వాటిని వాటి వాళ్లు గుర్తుపట్టకుండా ఈయన రంగులు మారుస్తాడు. వాటిని మంచి ధరకు బస్తీలో అమ్ముకుంటాడు. కోళ్ళను సంపాదించటానికి కోళ్ళనే ఉపయోగిస్తు న్నాడు మన రోశయ్య. చాలా తెలివైన దొంగతనం!'' అన్నాడు.

''అంతా అబద్ధం! కట్టు కథ! మీరు ఈ అబద్ధాలకోరు మాటలు నమ్మకూడదు,'' అన్నాడు రోశయ్య.

''ప్రస్తుతం నా పుంజులు రెండు రోశయ్య ఇంట ఉన్నాయి. మీరంతా నా వెంట వస్తే ఆ సంగతి రుజువు చేస్తాను,'' అన్నాడు చిన్నడు.

న్యాయాధికారితో సహా న్యాయస్థానంలో ఉన్న వాళ్ళంతా చిన్నడి వెంట రోశయ్య ఇంటికి వెళ్ళారు. అక్కడ వారికి రకరకాల కోళ్ళు, రంగురంగులవి కనిపించాయి. అంతా చూస్తూండగా చిన్నడు తన పిల్లిని కోళ్ళ మధ్యకు వదిలాడు.

పిల్లిని చూడగానే కోళ్ళు గోలగా అరుస్తూ చెల్లాచెదరుగా పరిగెత్తాయి. రెండుపుంజులు మాత్రం చిత్రంగా అరుస్తూ, స్నేహంగా పిల్లిని సమీపించాయి. పిల్లి ఆనందంగా కళ్లు మూసి వాటి మధ్య కూర్చున్నది. అవి చిన్నడి పుంజులేననీ, పిల్లితో స్నేహం కలవనీ స్పష్టంగా తెలిసిపోతున్నది.

చిన్నడు న్యాయాధికారితో, ''చూశారా, ఇక్కడ ఉన్న మిగతా కోళ్ళన్నీ కూడా ఊళ్లో వాళ్ళవే. రోశయ్య రంగులు పూయటం వల్ల వాటిని గుర్తించటం కష్టం కావచ్చు,'' అన్నాడు.

ఈ మాట క్షణంలో ఊరంతా పాకింది. కోళ్ళు పోగొట్టుకున్న వాళ్ళంతా వచ్చి రోశయ్య ఇంటి మీద పడి, కోళ్ళనన్నిటినీ కడిగి, ఎవరి కోళ్ళను వారు గుర్తించి తీసుకున్నారు.

న్యాయాధికారి రోశయ్యను కఠినంగా శిక్షించాడు.





# అర్ధరాత్రి వ్యాపారం

మొగుడు పోగానే మంగమ్మ, ఉన్న ఊళ్లో జీవనోపాధి లేక, పట్నంచేరి, ఒక పాడు పడిన ఇంట్లో మకాం పెట్టింది. ఆమె బాగా ఆలోచించి, బూరెలూ, గారెలూ అమ్మి పొట్ట పోసుకోవాలని నిర్ణయించు కున్నది. అందుకని ఆమె ఉన్న కొద్ది డబ్బుతో, అవసరమైన వస్తువు లన్నీ తెచ్చుకుని, చీకటి పడగానే నడుం వాల్చింది. ఆమె ఉద్దేశం వేకువ ఝామునే లేచి గారెలూ, బూరెలూ వేసి, వెలుగు రాగానే వీధి అరుగుమీద కూర్చుని వాటిని అమ్ముకోవాలని.

ఒక రాత్రివేళ పక్క యింటి కోడి పిల్లిని చూసి, ఒక కూతకూసి ఊరుకున్నది. కోడికూత విని మంగమ్మ కంగారుగా లేచి, తెల్లవారబోతున్న దనుకుని, నడుము బిగించి, పిళ్ళు రుబ్బిపెట్టుకుని, పెరట్లోనే పొయ్యి అమర్చి, దానికింద చితుకుల మంట చేసి, బూర్లెమూకుడులో ఝూరెలు వేయించ సాగింది. దోరగా వేగిన బూరెలు కమ్మగా వాసన కొట్టసాగాయి.

"ఏ మమ్మాయీ? కొత్తగా మొదలు పెట్టినట్టున్నావే వ్యాపారం?" అంటూ ఒక ముసలిమనిషి అక్కడికి వచ్చాడు.

"అవును, బాబూ. వేడి వేడి బూరెలు రుచిచూస్తారా?" అంటూ మంగమ్మ కొయ్య చెక్క వాల్చి, ముసలివాడికి నాలుగు బూరెలు పెట్టింది.

ఆ మనిషి బూరెలు తింటూ ఉండగానే మరి నలుగురు వచ్చారు. అందరూ కలిసి బూరెలన్నీ తినేశారు. గారెలు వేసేముందు మరి నలుగురు వచ్చారు. అందరూ కలిసి గారెలన్నీ తినేసి, "మంచి వ్యాపారం మొదలు పెట్టావమ్మా! రోజూ ఇలాగే గారెలూ, బూరెలూ వెయ్యి. రోజూ ఈవేళకు నిద్రపట్టక అవస్థపడుతూ ఉంటాము; ఏదో కాలక్షేపంగా తినిపోతాము," అన్నారు

ఎం. కామేశ్వరరావు

వాళ్ళు. అందరూ ముసలివాళ్ళే, ఇంచు మించు ఒక వయసు వాళ్ళు.

ఒక పంగనామాల వాడు మంగమ్మతో, "రేపు గోధుమ రొట్టెలూ, కోడి కూరా చెయ్యి. ఈ సంగతి నలుగురికీ చెప్పకు సుమా!" అన్నాడు.

మంగమ్మ నవ్వుకున్నది; బహిరంగంగా తినగూడనివి తినటానికి వాళ్ళు రహస్యంగా వస్తారని గ్రహించింది.

"ఎంత మాట, బాబూ? నాకా మాత్రం తెలీదా? అలాగే చేస్తాను," అన్న దామె ఆ నామాల వాడితో.

గారెలూ, బూరెలూ తిన్నవాళ్ళందరూ ఎవరి చేతికి వచ్చినంత డబ్బు వారు మంగమ్మ కిచ్చి, వెళ్ళిపోయారు. ఆ డబ్బు లెక్క చూసుకుంటే, ఆమె అనుకున్న దానికి పదింతలు ఉన్నది. ఆమె ఆశ్చర్య పోయి, తాను ఆరంభించిన బేరం లాభ సాటిగా ఉన్నందుకు సంతోషించింది.

తరవాత ఎంతోసేపటికి గాని తూర్పు తెల్లవారలేదు. తాను అర్ధరాత్రివేళ లేచి ఉండాలని మంగమ్మ గ్రహించి, రోజూ ఆ వేళకే లేవటానికి నిశ్చయించుకున్నది.

మర్నాడు ఆమె కొంత డబ్బు ఖర్చుపెట్టి రెండు కోళ్ళు కొని, అర్ధరాత్రి వేళకు గోధుమ రొట్టెలూ, కోడి కూరా చేసింది. కిందటిరోజు వచ్చిన వాళ్ళందరూ వచ్చి, రొట్టెలూ, కూరా తిని, డబ్బులిచ్చి వెళ్ళి పోయారు. ఆ రోజుకూడా మంగమ్మకు మంచి ఆదాయమే వచ్చింది.



ఇలాగే ప్రతి రాత్రీ మంగమ్మ వ్యాపారం ఎంతో లాభసాటిగా కొనసాగుతూ వచ్చింది.

మంగమ్మ ఇంటి వెనక ఉన్న డాబా యిల్లు ఒక కోమటిది. అతను డబ్బుకోసం గడ్డితినే రకం. ఒక రాత్రి అతనికి నిద్ర పట్టలేదు. ఎక్కడినుంచో కమ్మటి వాసన వస్తున్నది. అది ఎక్కడి నుంచి వస్తున్నదో చూడటానికి తన ఇంటి డాబా మీదికి వెళ్ళాడు. పక్క పెరడులో మంగమ్మ ఒంటరిగా కూర్చుని పొయ్యిమీద కోడికూర వండుతూ కనిపించింది. కోమటి కుతూహలంగా చూడసాగాడు. అతను చూస్తూండగానే పెరడంతా జనంతో నిండి పోయింది. మంగమ్మ అందరికీ వడ్డించి, వాళ్ళిచ్చిన డబ్బులు పుచ్చుకున్నది.

అంతా వెళ్ళిపోయాక ఆ డబ్బులన్నీ నేల మీదపోసి లెక్కపెట్టుకున్నది. అంత డబ్బు ఒక్కసారి చూడగానే కోమటికి కళ్ళు చెదిరాయి.

"ఒక్కరోజు కింత డబ్బా! ఈ మొగుడు చచ్చిన ముండ పని బాగుంది. నీచు తిన కూడని వాళ్ళంతా దీని దగ్గరచేరి, రహస్యంగా అన్నీ తినేస్తున్నారు. అందుకే అలా డబ్బు కుమ్మరించి పోతున్నారు," అని కోమటి అసూయగా అనుకున్నాడు. మంగమ్మను ఆ ఇంటి నుంచి తరిమేసి, దాని వ్యాపారం తనది చేసుకోవాలని అతనికి పుట్టింది.

మర్నాడు మధ్యాహ్నం కోమటి మంగమ్మ ఇంటికి వచ్చాడు. వంటింటిలో కొంగు





పరుచుకుని పడుకుని ఉన్న మంగమ్మ కోమటిని చూసి లేచి కూర్చున్నది.

కోమటి వస్తూనే, "పాపం, నువు చూస్తే నిక్షేపంలా ఉన్నావు. నీ కిదేం కర్మ?" అన్నాడు జాలిపడు తున్నట్టుగా.

ఆ మాటలు ఏమీ అర్థంకాక మంగమ్మ కోమటి కేసి అయోమయంగానూ, భయం గానూ చూసింది.

"అదుగో, అప్పుడే నీకు వెర్రిచూపు వచ్చేసింది. అవును మరి, పిశాచాలకు వండి వడ్డిస్తే ఏ మవుతుంది?" అన్నాడు కోమటి.

అప్పటికీ మంగమ్మకు ఆయన మాటలు అర్థంకాలేదు.

"నీ మొహం చూస్తేనే తెలిసిపోతున్నది పిశాచాలగాలి సోకిందని! అర్ధరాత్రి వచ్చే వాళ్ళకు నువు కోరినవి వండి పెట్టటం లేదూ?" అన్నాడు కోమటి.

మంగమ్మకు కోమటిమాట అర్థమయింది.

"ఇది మరీ బాగుంది! పెద్ద మనుషులు అడిగారు, చేసి పెట్టాను," అన్న దామె.

"నీ చేత ఇలాగే అన్నీ చేయించుకు తిని, చివరకు ఆ పిశాచాలు నిన్నే కాల్చుకు తినేస్తాయి. ఏదో నీ మంచి కోరి చెప్పాను," అన్నాడు కోమటి.

మంగమ్మ ఆ మాట విని కెవ్వుమని, "అర్ధరాత్రి వచ్చేది పిశాచాలా?" అని నమ్మలేనట్టుగా అడిగింది.

"ఇంకా సందేహమా? ఇంతకు ముందు ఈ ఇంట్లో ఉండిన ముసలిదాన్ని చివరకు పిశాచాలేగా కాల్చుకు తినేసింది? ముందే జాగ్రత్తపడి ఎక్కడికయినా పారిపో!" అని కోమటి మంగమ్మను అడలగొట్టేశాడు.

మంగమ్మ అప్పటి కప్పుడే మూటా ముల్లే సర్దుకుని, మరో వూరు పోతున్నానని కోమటికి చెప్పి వెళ్ళిపోయింది.

కోమటి సంతోషంగా తన యింటికి తిరిగి వచ్చి, జరిగినదంతా తన భార్యకు చెప్పి, "ఇవాళ రాత్రినుంచీ మంగమ్మ స్థానంలో నువ్వు కూర్చో, కనకవర్షం కురుస్తుంది," అని చెప్పాడు.

"అమ్మో, నేను కూర్చోను. ఆ మంగమ్మ దేవాంతకురాలు. అది అంత తేలికగా వెళ్ళి పోదు; వేళకు తిరిగి వచ్చి ఏదో గొడవ చేస్తుంది. కావాలంటే నువే కూర్చో. చూస్తూ ఉండు, ఆ వేళకువచ్చి మంగమ్మ నలుగుర్నీ పిలిచి, రచ్చ చెయ్యకపోతే!" అన్నది కోమటి భార్య.

అర్థరాత్రివేళ కోమటి బూరెలు వేయిస్తూ మంగమ్మ స్థానంలో కూర్చున్నాడు. కాస్సే పటికి ముసలివాళ్ళందరూ బిలబిలమంటూ వచ్చి, "ఒరే అబ్బీ! ఇక్కడ ఉండే ఆడమనిషి ఎక్కడికి వెళ్ళింది?" అని అడిగారు.

"పెళ్ళిచేసుకుని చక్కాబోయింది. మీకు ఇబ్బంది లేకుండా మీ పని నేను చేస్తున్నాను గద," అన్నాడు కోమటి, బూరెలు మొదటి వాయ తీస్తూ.

బూరెలు చూసి వాళ్ళు మొహాలు చిట్లించి, "ఈ సారికి ఇవి చేస్తే చేశావు గాని, రేపటి నుంచీ కోడి మాంసమూ, గొర్రె మాంసమూ చెయ్యి," అన్నారు.

పెళ్ళాం చెప్పినట్టుగా మంగమ్మ ఎక్కడ వస్తుందో అని భయపడుతున్న కోమటి, "ముందు డబ్బిచ్చి మరీ తినండి. లేకపోతే, చీకటి చాటున మోసం చేసి పోయినా దిక్కులేదు," అని వాళ్ళతో అన్నాడు.

ఈ మాట వినగానే ముసలివాళ్ళ కళ్ళు చింత నిప్పుల్లాగా మెరిశాయి. "కుర్ర పీనుగా! డబ్బిస్తేగాని మమ్మల్ని తిననీయవుగా? ఎంతధైర్యం! చచ్చినట్టు, మేము అడిగినవన్నీ చేసిపెట్టు! లేకపోతే నిన్ను ముక్కలు ముక్కలుగా నరికి నీ పొయ్యిలోనే కాల్చుకు తినేస్తాం! తప్పించుకోవాలని చూసినా నిన్ను వదలం!" అని కోమటి చేసినవన్నీ తినేసి, అంతా ఒక్కసారిగా మాయమయారు.

కోమటి అది మొదలు ఆదాయం చిల్లిగవ్వలేకుండా అర్ధరాత్రి వ్యాపారం చేస్తూనే ఉన్నాడు. మంగమ్మ తిరిగి రావాలని వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంటున్నాడు, కాని ఆమె తిరిగి రాదు!



# మొక్కుబడి

ఒక ఊళ్ళో ఒక రైతు ఉండేవాడు. ఒకసారి ఆ రైతు భార్యకు ప్రాణం మీదికి వచ్చింది. వైద్యం ఏమీ పనిచెయ్యలేదు. అప్పుడా రైతు వాళ్ళ గ్రామంలో ఉండే గుడిలోని దేవుడికి మొక్కుకుని, తన భార్య వ్యాధి నివారణ అయితే తనకున్న ఒకే ఒక ఆవును అమ్మి, అమ్మగా వచ్చిన డబ్బును ఆలయంలోని హుండీలో వేస్తానన్నాడు. త్వరలోనే రైతు భార్య జబ్బు తిరుగుముఖం పట్టి, ఆమె క్రమంగా కోలుకున్నది.

రైతు మొక్కుబడి చెల్లించవలసి వచ్చింది. అతను తన ఆవుతోబాటు ఒక పిల్లిని కూడా సంతకు తీసుకుపోయాడు. అక్కడ ఎవరో ఆవును కొనటానికి వచ్చి, ఆవు ధర అడిగారు.

"ఆవు ధర రూపాయి. పిల్లిలేకుండా ఆవును కొనటానికి లేదు. పిల్లి ధర నూరు రూపాయలు." అన్నాడు రైతు.

ఆవే నూరు రూపాయలు చేస్తుంది గనక, కొనదలచిన వాళ్ళు నూట ఒక్కరూపాయి ఇచ్చి, పిల్లినీ, ఆవునూ కొనుక్కుపోయారు. రైతు గుడి హుండీలో ఒక రూపాయివేసి, మిగిలిన నూరు రూపాయలతో మరొక ఆవును కొనుక్కుని. దానితో సుఖంగా జీవించాడు.

—కే. సి. వెంకటరమణ









పూర్వం ఒక దేశంలో ఒక రాజు ఉండేవాడు. ఆయన గొప్పదాతగా పేరు పొంది, ప్రజల కష్ట సుఖాలను శ్రద్ధగా విచారిస్తూ పరిపాలించే వాడు. అప్పుడప్పుడూ మారు వేషంలో తిరుగుతూ, రాజ్యంలోని ప్రజల పరిస్థితులు ఎలావున్నదీ స్వయంగా గమనించేవాడు.

ఆ దేశంలో ఒక ధనవంతు డుండేవాడు. అతను వట్టి స్వార్థపరుడు. ఎంత కష్టంలో ఉన్నవారికీ కూడా చిన్నమెత్తు ఉపకారం చేసేవాడు కాడు. అతని వద్ద దాన ధర్మాల ప్రసక్తి రావటానికే వీలు లేదు. అతని భార్య మటుకు దయాహృదయం కలది. భర్త ఇంటలేనప్పుడు ఏ బిచ్చగాడు వచ్చినా అంతో ఇంతో ఇచ్చిపంపేది.

ఒకరోజు ధనికుడు పుట్టినరోజు. అతని భార్య ఆ రోజు మంచి మంచి పంటకాలు చేసి భర్తకు వడ్డించింది. అతను వాటిని సంతోషంగా ఆరగిస్తూ ఉండగా ఒక బిచ్చగాడు వచ్చి ఆకలితో చచ్చిపోతున్నానని బయటి నుంచి కేకలు పెట్టాడు.

ధనికుడు వాడి కేకలు వినికూడా పట్టించుకోలేదు; అరిచి, అరిచి వాడే పోతాడు లెమ్మనుకున్నాడు.

అతని భార్య మాత్రం మనసులో చాలా బాధపడి, ఆ బిచ్చగాణ్ణి తన నోటితో పొమ్మనలేక పోయింది.

చివరకు బిచ్చగాడు, ఇక కేకలువేసి లాభం లేదనుకుని, "ఏం, తల్లీ? వెళ్ళిపోనా?" అని కేక పెట్టాడు.

అప్పటికైనా తన భర్త ఆ బిచ్చగాడికి ఇంత తిండి వెయ్యమంటాడేమో నని ఆమె చూసింది. కాని అతను తన పనిలో తాను ఉండిపోయాడు.

అప్పుడు ధనికుడి భార్య, "మా వారు చద్ది అన్నం తింటున్నారు. నువు మరో

కాపుగంటి లక్ష్మిపర్వతవర్ధని

ఇంటికి వెళ్ళు, నాయనా!'' అని కేక పెట్టింది.

ఈ జరిగినదంతా మారువేషంతో వీధిలో నిలబడి ఉండిన రాజు గమనించాడు. ధనికుడు వేడి వేడి అన్నం పంచభక్ష్య పరమాన్నాలతో ఆరగిస్తూ ఉండటం ఆయన చూశాడు. అతని భార్య బిచ్చగాడితో, ''ఇప్పుడు కాదు, పో!'' అని చెప్పక, తన భర్త చద్ది అన్నం తింటున్నాడని ఎందుకు అబద్ధం ఆడిందో ఎంత ఆలోచించినా ఆయనకు అర్థం కాలేదు.

మర్నాడు రాజభటులు ధనికుడి ఇంటికి వచ్చి, ధనికుడి భార్యను రాజుగారు రమ్మన్నారని చెప్పి, ఆమెను వెంట బెట్టుకు వెళ్ళారు. తన భార్య ఏమి ద్రోహం చేసిందోనని భయపడుతూ ధనికుడు కూడా ఆస్థానానికి వెళ్ళాడు.

రాజు ధనికుడి భార్యతో, ''నిన్న నీ భర్త పంచభక్ష్య పరమాన్నాలతో వేడి వేడి భోజనం చేస్తూ ఉంటే నువు బిచ్చగాడితో, నీ భర్త చద్ది అన్నం తింటున్నాడని ఎందుకు అబద్ధమాడావు? అబద్ధమాడటం నేరమని నీకు తెలియదా?'' అన్నాడు.

ఆ మాటకు ధనికుడి భార్య నవ్వి, ''మహారాజా, నేను అన్నమాటలో అబద్ధం ఏ మున్నది? చద్ది అన్నం అంటే పూర్వ జన్మలో చేసుకున్న పుణ్యంవల్ల ఈ జన్మలో అబ్బిన సిరి. ప్రస్తుతం నా భర్త ఆ ఐశ్వ ర్యాన్ని అనుభవించటంలో నిమగ్నుడై ఉన్నాడుగాని, ఈ జన్మలో ఏ మాత్రమైనా పుణ్యం చేసుకుని రాబోయే జన్మకు ఏమీ దాచుకోవటం లేదు. నేను బిచ్చగాడి ఆకలి కేకలు విని వాడితో ఆ మాటే చెప్పాను. మీరు దాన్ని తప్పుగా అర్థం చేసుకున్నారు,'' అన్నది.

రాజు ఆమె తెలివికి సంతోషించి, ధని కుడి కేసి తిరిగి, ''నీ భార్య చెప్పిన మాట విని ఇకనైనా సిగ్గుపడి బుద్ధిగా ప్రవర్తించు,'' అన్నాడు. ఆయన ధనికుడి భార్యకు పట్టు చీరె బహూకరించి పంపేశాడు.

తరవాత ధనికుడు దానధర్మాలు చెయ్యటం ప్రారంభించాడు.






# "చూసి నేర్చుకో"

ఒక ఊళ్ళో ఒక తల్లీ, కొడుకూ ఉండే వారు. కొడుకు పేరు వెంకన్న. వాడు తెలివి గల వాడేగాని, తల్లి గారాబంగా పెంచటం చేత కడుపునిండా తినటం తప్ప ఇంకేమీ నేర్చుకోలేదు.

ఒక నాడు తల్లి వాడితో, "నీకు పెళ్ళి చేసుకునే వయసు కూడా వచ్చింది కదా, సంపాయిచటం చేతకాని వాడివి పెళ్ళాన్ని ఎలా పోషిస్తావు?" అన్నది.

"నేను ఏ పనీ నేర్చుకోలేదే, ఏం చెయ్యనూ?" అని వాడు తల్లిని అడిగాడు.

"పుట్టుతూనే ఎవరికీ ఏ పనీ రాదు. ఎవరినో ఒకరిని చూసి నేర్చుకోవాలి. చూడు, మన ఇంటి ఎదురుగా చెప్పులు కుట్టే వాడున్నాడు. వాడికి కుడిపక్కన మంగలి వాడున్నాడు. ఎడమ పక్కన దర్జీ వాడున్నాడు. వాళ్ళను చూసి నువు బుద్ధి తెచ్చుకో. నాలుగు డబ్బులు సంపాదించుకుంటే నీ పెళ్ళి ఖర్చుకైనా ఉంటుంది," అన్నది వెంకన్నతో వాడి తల్లి.

ఈ మాట వెంకన్న బుర్రకు పట్టింది. వాడు తమ ఇంటి ముందు కూర్చుని చెప్పులు కుట్టేవాణ్ణీ, మంగలినీ, దర్జీనీ శ్రద్ధగా చూడ నారంభించాడు.

"బయట అరుగు మీద కూర్చుని రోజల్లా ఏం చేస్తున్నావురా?" అని తల్లి వాణ్ణి ఒకసారి అడిగింది.

"నువు చెప్పినట్టే చూసి నేర్చుకుంటున్నా నమ్మా!" అన్నాడు వెంకన్న.

ఒకనాడు ఉన్నట్టుండి, చెప్పులు కుట్టే వాడికీ, మంగలికీ, దర్జీకీ ఎక్కడలేని గిరాకీ తగిలింది. ఈ రద్దీకి కారణం వెంకన్న అడిగి తెలుసుకున్నాడు. రాజుగారికి లేక లేక కలిగిన కొడుకు పుట్టినరోజు వస్తున్నదట. ఆ రోజు అందరికీ అన్నదానం చేస్తారట. పండితులకూ, పామరులకూ కూడా పోటీలు

సి. ఆంజనేయశర్మ

జరుగుతాయట. ఆ పోటీలలో నెగ్గిన వారికి బహుబతులు ఇస్తారట.

ఈ మాటవిని ఆ సంబరానికి మంచి బట్టలు వేసుకుని వెంకన్నకూడా వెళ్ళాడు. భోజనాలు అయాక రకరకాల పోటీలు జరిగాయి. తరవాత మాటల పోటీలు జరిగాయి. అది పండిత పామర పోటీ. అందులో ఎవరైనా ప్రశ్నలు వేయవచ్చు, ఎవరైనా సమాధానాలు చెప్పవచ్చు, మంచి ప్రశ్నలు అడిగినవారికీ, వాటికి సమాధానాలు చెప్పిన వారికీ కూడా బహుమతులున్నాయి.

వెంకన్న సమయం చూసుకుని, "నేను మూడు ప్రశ్నలు అడుగుతాను," అన్నాడు. వాడికి అనుమతి లభించింది.

"ఒకడు కింద చూస్తూ పనిచేస్తాడు. ఒకడు పైకీ, కిందికీ చూస్తూ పనిచేస్తాడు. ఒకడు పైనే చూస్తూ పనిచేస్తాడు. ఎవరు వాళ్ళు?" అని వెంకన్న అడిగాడు.

కొంత సేపు ఎవరూ జవాబు చెప్పలేదు. చివరకు ఒక పండితుడు లేచి, "కింద చూసేవాడు సాధువు; లోకం మీద దృష్టి లేకుండా తన పని తాను చేసుకుపోతాడు. కిందికీ పైకీ చూసేవాడు లౌకిక సుఖాలను మాత్రమే కోరేవాడు. పైకి చూసేవాడు భక్తుడు; వాడి దృష్టి భగవంతుడి మీదనే ఉంటుంది," అన్నాడు.

"వారి చూపుకూ వారు చేసేపనికీ సంబంధం చెప్పాలి," అన్నాడు వెంకన్న.

"అయితే నీ ప్రశ్నకు నువే సమాధానం చెప్పు," అన్నారు పెద్దలు.

"కింద చూస్తూ పనిచేసేవాడు చెప్పులు కుట్టేవాడు; వాడు మనుషుల పాదాలనే చూస్తూ ఉంటాడు. మనుషుల తలల మీదనే దృష్టి నిలిపేవాడు మంగలి. మనుషులను ఆపాదమస్తకం చూసేవాడు దర్జీవాడు," అన్నాడు వెంకన్న.

ఆ సమాధానానికి అందరూ హర్షించారు. వాడి ప్రశ్నకూ, సమాధానానికీ చెరొక అయిదు వందలూ బహుమానం లభించింది. వాడు ఆ డబ్బు తీసుకుపోయి తల్లి ముందుపెట్టి, "చూడమ్మా, చూసి నేర్చుకున్న దానికి ఫలితం!" అన్నాడు.







పరమదరిద్రుడైన ఒక బ్రాహ్మణుడు మాళవదేశపు రాజైన భోజరాజు గురించి విన్నాడు. ఆ రాజు అనేకులకు నిత్యమూ సన్మానాలు చేస్తున్నాడట. ఆయన ఆస్థానంలో ఉన్న కాళిదాసు తనలాటి కటిక దరిద్రులకు కూడా ఏదో విధంగా సన్మానాలిప్పిస్తున్నాడట. ఇది విని ఆ బ్రాహ్మణుడు ధారానగరానికి వెళ్ళి, కాళిదాసు దర్శనం చేసుకుని, తాను పరమ దరిద్రుణ్ణి అనీ, తనకు చదువు సంధ్యలు ఒంటబట్టలేదనీ, కుటుంబ భారం హెచ్చుగా ఉన్నదనీ, తన దారిద్ర్యాన్ని ఎలాగైనా తొలగించే ఉపాయం చూడమనీ విన్నవించుకున్నాడు.

"నేను నా చేతనైన సహాయం చేస్తాను. ఆ తరవాత నీ అదృష్టం ఎలా ఉందో మరి. నువు మాత్రం రాజదర్శనానికి వట్టిచేతులతో రాక, ఏదైనా కానుక తీసుకుని వచ్చి, ద్వారం వద్ద వేచి ఉండి, లోపలికి రమ్మని పిలుపు వచ్చినప్పుడు రాజుగారి సన్నిధికి వచ్చి, నువు తెచ్చిన కానుకను రాజుగారికి అందించు. రాజసభలో మాత్రం ఎవరు ఏమి ప్రశ్నించినా, పూర్తిగా మౌనం వహించి ఊరుకో. ఆ పైన నీ అదృష్టం!" అన్నాడు కాళిదాసు.

మర్నాడు ఆ బ్రాహ్మణుడు ఎవరి దగ్గిరో ఒక చెరుకుగడ ముష్టి ఎత్తి, దాన్ని చిన్న తుండ్లుగా నరికి, ఆ ముక్కలను తన కొల్లాయి గుడ్డలో చుట్టి పట్టుకుని, రాజ ద్వారం వద్దకు వచ్చి, అక్కడ కూర్చున్నాడు.

లోపలి నుంచి పిలుపు వచ్చేలోపల ఆ దౌర్భాగ్యుడికి నిద్ర ముంచుకు వచ్చింది. అందుచేత ఆయన తన కొల్లాయి మూటను తల కింద పెట్టుకుని, రాజ ద్వారం సమీపంలో నిద్రపోయాడు.

ఎస్. గోపాలకృష్ణ



విద్వాంసుడు వచ్చి వేచి ఉన్నాడు. ఆయన మౌనవ్రతం అవలంబించి ఉన్నాడు," అని చెప్పాడు.

అది విని రాజు ఒక సేవకుణ్ణి ద్వారం వద్దకు పంపాడు. వాడు వచ్చి బ్రాహ్మణ్ణి లేపి, "అయ్యా, రాజదర్శనార్థం వచ్చిన మహా పండితులు తమరేనా?" అని అడిగి, ఔనన్న మీదట అతన్ని రాజు వద్దకు తీసుకుపోయాడు.

ఆ బ్రాహ్మణుడు రాజుగారి ముందు తన కొల్లాయి మూట విప్పే సరికి అందులో కాలి చల్లారిన కట్టెపుల్లలున్నాయి. దరిద్ర దేవత తన వెంట రాజుగారి కొలువుకు కూడా వచ్చి నందుకు ఆ బ్రాహ్మణుడు నిర్ఘాంతపోయాడు.

ఆ కట్టెపుల్లలను చూసి సభలో అందరూ ఆశ్చర్యపోయారు. రాజుకు పట్ట రాని ఆగ్రహం వచ్చి, "ఏమిటిది?" అన్నట్టు కాళిదాసు కేసి చూశాడు.

కాళిదాసు ఆ బ్రాహ్మణుడి మతిలేని తనానికి చిరాకుపడి, ఎలాగైనా అతని ప్రాణాలు రక్షించే భారం తనపైన ఉన్నది గనక, "మహారాజా, ఈ మహా పండితుడు తమకు సమర్పించేందుకు ఇలాంటి కానుక తీసుకు రావటంలో గొప్పగూఢార్థం ఉన్నది. దాన్ని ఈ విధంగాచెప్పవచ్చు." అంటూ ఇలా శ్లోకం చదివాడు:

ఆ బ్రాహ్మడి కన్న కూడా దరిద్రుడు ఒకడు ఆ చెరుకు ముక్కల కోసం ఆశపడి, బ్రాహ్మణుడి తల కింద ఉన్న మూటను మెల్లిగా లాగి, అందులో నుంచి చెరుకు ముక్కలను తీసేసి, వాటికి బదులుగా కాల్చి చల్లార్చిన కట్టెపుల్లలను కొల్లాయిలో చుట్టి బ్రాహ్మణుడి తల కింద పెట్టి పారి పోయాడు.

ఒళ్ళు మరచి నిద్రపోతున్న బ్రాహ్మ ణుడికి ఈ జరిగిన దొంగతనం, మోసం సంగతి ఏ మాత్రమూ తెలియలేదు.

ఈ సమయంలో రాజసభలో కాళిదాసు మాటల సందర్భంలో రాజుతో, "తమ దర్శనార్థం దూరదేశం నుంచి ఒక మహా

దగ్ధం ఖాండవ మర్జునేన చ వృథా
దివ్యద్రుమైర్భూషితం,
దగ్ధా వాయుసుతేన హేమరచితా లంకా
పురీ స్వర్గభూః
దగ్ధ స్సర్వసుఖాస్పదశ్చ మదనో హా!హా!
వృథా శంభునా;
దారిద్ర్యం ఘనతాపదం భువి నృణాం
కేనాపి నో దహ్యతే.

(దివ్య వృక్షాలతో కూడిన ఖాండవ వనాన్ని అర్జునుడు వృథాగా తగలబెట్టాడు. బంగారంతో చేసి, స్వర్గంతో సమానంగా ఉండిన లంకాపురిని హనుమంతుడు వృథాగా తగలబెట్టాడు. అన్ని సుఖాలనూ ఇవ్వగల మన్మథుణ్ణి శివుడు వృథాగా తగలబెట్టాడు. కానీ ప్రపంచంలో మానవులను అమితంగా బాధించే దారిద్ర్యాన్ని ఎవరూ తగలబెట్ట లేక పోయినారు.)

ఈ శ్లోకం చదివి కాళిదాసు రాజుతో, "తమరైనా దారిద్ర్యాన్ని దగ్ధం చేస్తారన్న నమ్మకంతో ఈ పండితుడు మీకే కట్టెలు ఇచ్చాడు," అన్నాడు.

ఈ మాటవిని రాజూ, సభికులూ చాలా ఆనందపడి పోయారు. రాజు ఆ బ్రాహ్మణుణ్ణి ఎంతగానో గౌరవించి, విశేషంగా ధనం ఇప్పించి పంపాడు.

కాళిదాసు చదివిన శ్లోకం ఏమిటో, రాజు తనకు అంత ధనం ఎందు కిచ్చాడో తెలియని ఆ బ్రాహ్మణుడు వెనక్కు తిరిగి తిరిగి చూస్తూ బయలుదేరాడు.

"ఆ పండితుడు అలా ఎందుకు వెనక్కు తిరిగి తిరిగి చూస్తూ పోతున్నాడు?" అని రాజు కాళిదాసును అడిగాడు.

"దారిద్ర్యదేవత ఇంకా తన వెంట పడిరావటం లేదు గదా అని చూసుకుంటూ ఆయన పోతున్నాడు, మహారాజా!" అన్నాడు కాళిదాసు.

"ఆహా! ఎంతటి మహా పండితుడు! ఆయనకు మౌనవ్రతమే లేకపోతే ఆయన నోటి నుంచి ఎంత గొప్ప విషయాలు విని ఉందుము!" అనుకున్నాడు భోజరాజు, కాళిదాసు తనను మోసగించిన సంగతి తెలియక.






లెబనాన్ దేశంలోని ఒక గ్రామంలో హనీ, మరియం అని భార్యా భర్తలు ఉండేవారు. హనీ మంచివాడే గాని, కొంచెం మందమతి. అతను పనికి మొండి కూడానూ. మరియం మటుకు తెలివిగలదీ, సమర్థురాలూనూ. ఆమె భాగ్యవంతుల ఇళ్లలో పాచిపనులు చేసి, తననూ, తన భర్తనూ పోషించు కుంటూ ఉండేది. ఎక్కడికైనా వెళ్ళి, ఏదైనా పని చూసుకోమని ఆమె నిత్యమూ హనీని పోరేది. కాని హనీ ఆమె మాట పట్టించుకోక, నవ్వి ఊరుకునేవాడు.

ఒకనాడు మరియం జబ్బుపడి పనికి వెళ్ళలేకపోయింది. ఆమెకు హనీ మీద చాలా కోపం వచ్చింది. "నువు ఏదైనా పని చేసి డబ్బులు తీసుకురాకపోతే ఇద్దరికీ పస్తే! గ్రామపెద్ద వద్దకు వెళ్ళి, గాడిదను తోలే పని అడుగు. వాళ్ళ ఇంటి పనులు చూడటానికి అవసరం పడితే గాడిద మీద ఎక్కడికైనా వెళ్ళవలిసి ఉంటుంది," అన్నదామె హనీతో.

మర్నాడు ఉదయం హనీ పెందలాడే నిద్రలేచి గ్రామపెద్ద ఉండే భవనానికి వెళ్ళాడు. గ్రామ పెద్దకు హనీ అమాయకత్వం గురించీ, పెళ్ళాం అతన్ని పోషిస్తూ ఉండటం గురించీ పూర్తిగా తెలుసు. ఆయన హనీని చూసి జాలిపడి, సహాయం చెయ్యా సంకల్పించి, హనీ చేతిలో ఒక బంగారు దీనారం పెట్టి, ఒక గాడిదను కొనుక్కు రమ్మన్నాడు. హనీ ఆ ప్రకారమే బీరూట్‌నగరం వెళ్ళి, అక్కడి సంతలో మంచి బలంగల గాడిదను కొని తెచ్చి, గ్రామపెద్ద వద్ద పని ప్రారంభించాడు. యజమాని అతనికి ఏ రోజు జీతం ఆ రోజు ఇస్తూ వచ్చాడు.

ఒక నాడు గ్రామపెద్ద హనీతో, "నువు బీరూట్‌కు పోయి ఫలానా దుకాణంలో

ఒక బస్తాడు బియ్యం కొనుక్కు రా," అన్నాడు.

ఆ దుకాణం హనీకి తెలుసును, కాని ఆ రోజు అతనికి మరీ బద్ధకంగా ఉండి, బీరూట్‌కు పో బుద్ధి పుట్టలేదు. అయితే బియ్యం కొనుక్కు రావటానికి గాడిదను మాత్రమే పంపితే తనకు శ్రమ తప్పుతుం దని అతనికి తోచింది.

వెంటనే అతను గాడిద వద్దకు వెళ్ళి, "చూడు, నువు ఒంటరిగా బీరూట్‌కు పోయి, మనకు వాడుకగా బియ్యం ఇచ్చే దుకాణంలో ఒక బస్తా బియ్యం కొని, తీసుకురాగలవా?" అని అడిగాడు.

గాడిద తన తలను పైకీ కిందికీ అల వాటు ప్రకారం ఆడించింది. కాని హనీ మటుకు, తన మాటలు గాడిద అర్థం చేసు కున్నదనీ, తాను చెప్పినట్టు చెయ్యటానికి ఒప్పుకున్నదనీ అనుకుని చాలా సంతోషిం చాడు. అతను గాడిద తల మీద ఒక పాగా చుట్టి పెట్టి, దాని మడతలలో తన యజమాని ఇచ్చిన దీనారం ఉంచి, గాడిదను బీరూట్ రహదారి మీద వదలి, అది కనుమరుగు అయినదాకా చూసి, ఇంటికి తిరిగి వచ్చేశాడు.

తన భర్త ఆ వేళప్పుడు గాడిద లేకుండా ఇల్లుచేరటం చూసి అతని భార్య ఆశ్చర్య పడి, "బీరూట్ పోలేదేం? గాడిద ఏమయింది?" అని అడిగింది.

"గాడిదను ఒంటరిగా పంపాను. ముందు అడిగానులే! ఒంటరిగా వెళ్ళి,





యజమానికి బియ్యం బస్తా కొనుక్కురా గలవా అని అడిగితే గాడిద కొనుక్కురాగల నని చెప్పి, బయలుదేరింది," అన్నాడు హనీ భార్యతో.

"బుద్ధి తక్కువ దద్దమ్మా! ఎద్దుమొద్దు స్వరూపమా! నీ గాడిదా, దీనారమూకూడా పోయాయి. దాని కోసం వెతుకు. వెంటనే బయలుదేరి, బీరూట్ రహదారి వెంటపో. గాడిదనూ, బియ్యాన్నీ తీసుకురాకుండా ఇంటికి తిరిగిరాకు!" అని అతని భార్య చిందులు తొక్కింది.

హనీ ఇంటి నుంచి పరిగెత్తు కుంటూ వెళ్ళి బీరూట్ రోడ్డు పట్టుకున్నాడు. ఆయాసంతో కళ్ళూ, నాలుకా వెళ్ళుకొచ్చిన దాకా పరిగెత్తాడు. కాని అతనికి గాడిద కనిపించలేదు.

అతను బీరూట్‌నగరం చేరి వాడుక దుకాణానికి వెళ్ళి, "మా గాడిద వచ్చి మీ దగ్గిర బియ్యం కొన్నదా? ఇంతవరకూ అది ఇంటికి తిరిగిరాలేదు." అని బియ్యపు వర్తకుణ్ణి అడిగాడు.

బియ్యపు వర్తకుడు హనీ కేసి చూసి, అతను వెర్రిబాగుల వాడని గ్రహించి, అతనితో హాస్యానికి దిగి, "నిజమే, గాడిద ఈ ఉదయం వచ్చింది. కాని దానికి మా దుకాణంలో వున్న బియ్యం నచ్చలేదు. అందుచేత అది మరొక బియ్యం దుకాణానికి వెళ్ళింది," అంటూ ఆ దుకాణం చూపించాడు.

హనీ పక్కనే ఉన్న ఆ దుకాణానికి వెళ్ళాడు. ఆ సమయంలో మొదటి దుకాణం వాడు రెండో దుకాణం వాడికి సైగలు చేశాడు. రెండో దుకాణం వాడు వాటిని అర్థం చేసుకుని, హనీ తన దుకాణానికి రాగానే, "ఏం కావాలి? అని అడిగాడు.

హనీ మొదటి వర్తకుణ్ణి అడిగినట్టే రెండో వాణ్ణి కూడా, "మా గాడిద వచ్చి మీ దుకాణంలో బియ్యం కొన్నదా? ఇంతవరకూ అది ఇంటికి తిరిగిరాలేదు," అని అడిగాడు.

"అవునండీ, మీ గాడిద వచ్చింది. కాని దానికి బీరూట్ బియ్యం నచ్చలేదుట. జాఫానగరంలో బియ్యం బాగుంటుందని అక్కడికి వెళ్ళింది," అన్నాడు రెండో బియ్యం వ ర్తకుడు.

హనీకి కంగారు పుట్టింది. తాను జాఫాకు వెళ్ళి, గాడిదను తీసుకురాక తప్పదు. లేక పోతే మరియం ఇంట్లో అడుగు పెట్ట నియ్యదు. అందుచేత అతను ఆ వ ర్తకుడి దగ్గిరే ఒక దీనారం అరువు తీసుకుని జాఫాకు వెళ్ళాడు.

అతను జాఫాలో అంగళ్ళ ప్రాంతమంతా తన గాడిద కోసం వెతుకుతూ చెడతిరిగాడు. గాడిద జాడలేదు. దారేపోయే వాణ్ణి ఒకణ్ణి ఆపి, ఆ నగరంలోకెల్లా పెద్ద బియ్యపు దుకాణం ఎక్కడో అడిగి తెలుసుకున్నాడు.

అతను ఆ పెద్ద దుకాణం ప్రవేశించి, "మా గాడిద మా యజమాని కోసం బియ్యం కొనటానికి ఇక్కడికి ;.ని వచ్చిందా?" అని అడిగాడు.

ఈ దుకాణం గల వాడికి ఆ నగరపు ప్రధాన న్యాయాధికారి పైన పాత పగ ఏదో ఉన్నది. హనీ ఇలా అడగగానే న్యాయాధికారి పైన పగ సాధించుకునే అవకాశం తట్టి, ఆ వ ర్తకుడు హనీతో చాలా స్నేహపూర్వకంగా, "కొంతసేపటి కింద మీ గాడిద మా దుకాణానికి వచ్చిన మాట నిజమే. అది బియ్యం ధర విషయమై నాతో బేరమాడ సాగింది. దుకాణంలో గొడవ ఏమిటా అని జనం గుంపులు గుంపులుగా చేరారు. మీ గాడిద తెలివితేటలు చూసి ప్రజలు



ముచ్చటపడి, దాన్ని ప్రధాన న్యాయాధికారిగా నియమించారు. ఈ నిమిషాన అది మనిషి వేషం వేసుకుని న్యాయస్థానంలో తీర్పులిస్తున్నది," అన్నాడు.

అంతేగాక ఆ వర్తకుడు హనీని న్యాయస్థానం వాకిలి దాకా తీసుకువెళ్ళి, న్యాయాధికారి ఎక్కడ కూర్చునేదీ చెప్పాడు.

అయితే, పెద్ద హోదా సంపాదించిన తన గాడిద ఇప్పుడు తన వెంట పిలవగానే రాదేమోనని హనీకి అనుమానం వేసింది. అందుచేత అతను వెళ్ళి ఒక ముల్లంగి దుంపల కట్ట కొని, చప్పున న్యాయస్థానానికి తిరిగి వచ్చాడు. కాని ద్వారం వద్ద కాపలా ఉన్నవాడు అతన్ని లోపలికి వెళ్ళకుండా అటకాయించాడు, హనీ వాడితో తగాదా పెట్టుకున్నాడు.

న్యాయాధికారి ఈ పోట్లాటవిని, అదేమిటని అడిగాడు, ఆయనకు హనీ గురించి తెలిసింది. ఇది బియ్యం దుకాణంవాడి పనే అయి ఉంటుందని ఆయన గ్రహించి, తన కోపాన్ని నిగ్రహించుకుని, హనీని లోపలికి రానియ్యమన్నాడు.

హనీ లోపలికి వచ్చి, తన చేతిలో ఉన్న ముల్లంగి కట్ట ఆడిస్తూ, "ఇది నా గాడిద. న్యాయాధికారి దుస్తులు వేసుకున్నది. దాని తలపాగాలో ఒక దీనారం కూడా దాచాను," అన్నాడు.

హనీ వెర్రిబాగుల వాడని న్యాయాధికారికి తెలిసిపోయింది. ఆయన అతనితో సౌమ్యంగా, "నీ గాడిదను ఎంతపెట్టి కొన్నావు?" అన్నాడు. హనీ ఒక బంగారు దీనారం పెట్టి కొన్నానన్నాడు.

న్యాయాధికారి అతనికి నాలుగు బంగారు దీనారాలిచ్చి, ఇక గొడవచెయ్యకుండా ఇంటికి వెళ్ళమన్నాడు.

బతుకు జీవుడా అని హనీ మరొక గాడిదను కొని, బస్తా బియ్యం కొని, దాన్ని గాడిద మీద వేసుకుని తన యజమాని ఇల్లు చేరుకుని, బియ్యం ఆయనకు అందజేసి, తన ఇంటికి తిరిగి వచ్చేశాడు. ఆ తరవాత అతను ఎన్నడూ గాడిదల మాట నమ్మలేదు.





# మహాభారతం

మర్నాడు యుద్ధం ప్రారంభమవుతుందనగా ఆ రాత్రి దుర్యోధనుడు తన సేనలోని ప్రముఖ యోధులను, "మీరు పాండవ సేనను నిర్మూలించటానికి ఎంతకాలం పట్టుతుంది?" అని అడిగాడు.

తనకు ముప్పైరోజులు పట్టుతుందని భీష్ముడు చెప్పాడు. ద్రోణుడు తాను వృద్ధుడూ, బలహీనుడూ అయాడు కనక తనకు కూడా ముప్పైరోజులు పట్టుతుందన్నాడు. కృపుడు తనకు రెండు మాసాలు పట్టుతుందన్నాడు. అశ్వత్థామ తనకు పది రోజులు పట్టుతుందన్నాడు. కర్ణుడు తనకు అయిదు రోజులు చాలునన్నాడు. అది విని భీష్ముడు నవ్వి, "కృష్ణుడి సహాయంతో అర్జునుడు ఎదురుపడనంత కాలమూ నువ్వు ఇలాగే ప్రగల్భాలు పలికి, ఇంతకన్న కూడా గొప్పలు చెప్పుకుంటావు." అన్నాడు.

ఈ సంగతి చారుల ద్వారా విని ధర్మరాజు అర్జునుడికి ఆ మాట చెప్పి, "నువ్వు కౌరవ సేనను ఎంతకాలంలో నిర్మూలించ గలవు?" అని అడిగాడు.

దానికి అర్జునుడు, "నీ కెందుకు విచారం? మన యోధులు కౌరవసేనను నిస్సంశయంగా నిర్మూలించగలరు. నన్నడిగితే, మూడు లోకాలూ ఎత్తి వచ్చినా ఒక్క క్షణంలో జయించగలనంటాను. ఎందుకంటే, నా దగ్గిర పాశుపతాస్త్రం ఉన్నది. అది భీష్మ, ద్రోణ, కృప, కర్ణుల వద్ద లేదు. కాని అలాటి అస్త్రంతో అందరినీ చంపరాదు." అన్నాడు.

53. యుద్ధానికి ముందు



మర్నాడు తెల్లవారగానే కౌరవసేనలు పాండవసేనల కేసి నడిచాయి. దుర్యోధనుడి పక్షాన వున్న రాజులలో పరస్పరాభిమానమూ, విజయకాంక్షా కనిపించాయి.

కురుక్షేత్రం మధ్యలో దుర్యోధనుడు శిబిరం నిర్మించి, దాన్ని మరొక హస్తినాపురం లాగా తయారు చేయించాడు. అది నగరం లాగున్నది గాని శిబిరం లాగా లేదు.

అదే విధంగా పాండవసేనలు కూడా యుద్ధభూమికి కదలి వచ్చాయి. ఉభయ పక్షాల సేనలూ రెండు మహా సముద్రాల లాగా కురుక్షేత్రంలో కూడేసరికి, మిగిలిన ప్రపంచంలో పిల్లలూ, స్త్రీలూ, ముసలి వాళ్ళూ మాత్రమే మిగిలారు.

యుద్ధం ప్రారంభం కాబోతూ ఉండగా వ్యాసుడు ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి, "నీ కొడుకులకూ, మిగిలిన రాజులకూ కాలం మూడింది. నువు వారి కోసం దుఃఖించటం అనవసరం. నువు యుద్ధాన్ని చూడ గోరినట్టయితే నీకు దివ్యదృష్టి ఇస్తాను. దాని సహాయంతో నువు యుద్ధరంగంలో ఏమేమి జరుగుతున్నదీ చూడగలుగుతావు," అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "మహర్షీ, జ్ఞాతుల చావు కళ్ళారా ఎలా చూసేది? యుద్ధం గురించి వివరాలు వింటాను. అందుకు ఏదైనా పద్ధతి ఉంటే చెప్పు," అన్నాడు.

అప్పుడు వ్యాసుడు, "యుద్ధరంగమంతా రాత్రింబగళ్ళు ఈ సంజయుడి కళ్ల ముందు కనపడేటట్టు చేస్తాను. అతను నీకు యుద్ధక్రమమంతా చెబుతాడు," అన్నాడు. అదే విధంగా సంజయుడు యుద్ధవార్తలను ధృతరాష్ట్రుడికి తెలుపుతూ వచ్చాడు.

యుద్ధారంభానికి ముందు కౌరవసేనకు సర్వసేనాని అయిన భీష్ముడు యుద్ధం చేయబోతున్న రాజులతో, "రాజులారా, మీ కందరికీ స్వర్గ ద్వారాలు తెరిచి ఉన్నాయి. ఆ ద్వారంకుండా ఇంద్రలోకానికీ, బ్రహ్మలోకానికీ వెళ్ళండి. క్షత్రియులకు ఇదే సరి అయిన మార్గం. నిర్భయంగా పోరాడండి. క్షత్రియుడు వ్యాధిగ్రస్తుడై, మంచానపడి చావరాదు," అన్నాడు.

భీష్ముడు రణరంగంలో నిలిచి ఉండగా యుద్ధరంగంలోకి అడుగు పెట్టనని ప్రతిజ్ఞ చేసిన కర్ణుడు తప్ప మిగిలిన రాజులంతా యుద్ధఘోషతో కదిలారు.

ఉభయ సైన్యాలూ వ్యూహంలో తీర్చి దిద్దబడ్డాయి. పాండవసేనకు భీముడు ముందు నడిచాడు. శిఖండి సైన్యం వ్యూహ మధ్యంలో ఉన్నది. కుడి పార్శ్వాన్ని సాత్యకి రక్షిస్తున్నాడు. ధృష్టద్యుమ్నుడు వ్యూహ మంతటా సంచరిస్తున్నాడు. కృష్ణుడు సారథిగా రథం మీద కూర్చున్న అర్జునుడు, రెండు సేనల మధ్య తన రథాన్ని నిలప మని కృష్ణుణ్ణి కోరాడు. కృష్ణుడు అలాగే చేసి, "అర్జునా, భీష్మద్రోణులు మొదలు గాగల కౌరవవీరులను చూడు," అన్నాడు.

అర్జునుడికి తన ఎదట కనిపించినవారు అతనికి తండ్రులూ, తాతలూ, గురువులూ, మేనమామలూ, సోదరులూ, మనమలూ అయిన బంధుజనం. యుద్ధంలో వారి నందరినీ చంపాలనే సరికి అతనికి కంపరం పట్టుకున్నది. చేతి నుంచి గాండీవం జారి పోతున్నట్టయింది.

అతను కృష్ణుడితో, "యుద్ధంలో ఈ బంధువులను చంపటంలో గల మేలేదీ నాకు కనబడదు. నాకు రాజ్యం వద్దు, సుఖాలు వద్దు," అంటూ దుఃఖంతో రథంలో కూలబడ్డాడు.



అదిచూసి కృష్ణుడు, "అర్జునా, నీ కిదేం మనోజాడ్యం? ఇది స్వర్గానికి దారితీయదు, అపకీర్తి తెస్తుంది! వీరుడవైన నీ కిది తగదు. చావుబతుకులను గురించి బుద్ధిమంతులు శోకించరు. ఆత్మకు ఒక దేహం శాశ్వతం కాదు. దానికి దేహాలు వస్తాయి, పోతాయి. ఆత్మ చచ్చేది కాదు, చంపేదీ కాదు. అది చినిగిన బట్టలు వదిలేసి కొత్త బట్టలు వేసు కున్నట్టుగా జీర్ణమైన దేహాలను విడిచి, కొత్త దేహాలను ధరిస్తుంది. అందుచేత నువు యుద్ధానికి సిద్ధపడు. క్షత్రియుడికి యుద్ధం చెయ్యటం ఉత్తమ ధర్మం. యుద్ధం మాని కీర్తికీ, స్వర్గానికీ దూరం కాకు. అపకీర్తి కన్న మరణం మేలు.



యుద్ధంలో గెలిచావా భోగాలు అనుభవిస్తావు; చచ్చావా స్వర్గసుఖాలు అనుభవిస్తావు. సుఖదుఃఖాలనూ, లాభా లాభాలనూ, జయాపజయాలనూ సమంగా చూడటం బుద్ధిమంతుల లక్షణం." అంటూ అర్జునుడికి హితబోధ చేశాడు.

కృష్ణుడి బోధల వల్ల అర్జునుడి మనసు మారింది. అతని సంశయాలు తొలగాయి.

ఇంతలో ధర్మరాజు తన కవచం విప్పి, తన ఆయుధాన్ని ఒక పక్కన పెట్టి, రథం నుంచి దిగి, చేతులు జోడించుకుని కాలి నడకన భీష్ముడి కేసి బయలుదేరాడు. అది చూసి అర్జునుడూ, మిగిలిన పాండవులూ రథాలు దిగి, ధర్మరాజు వెనకగా బయలుదేరారు. అందరి వెనకగా కృష్ణుడు కూడా వెళ్ళాడు.

అర్జునుడు ధర్మరాజును, "రాజా, మమ్మల్ని విడిచిపెట్టి, ఇలా శత్రుసేన కేసి వెళ్ళుతున్నా వెందుకు?" అని అడిగాడు.

భీమ, నకుల, సహదేవులు కూడా ధర్మరాజును అదే ప్రశ్నవేశారు. వాళ్ళ ప్రశ్నలు వినికూడా జవాబు చెప్పకుండా ధర్మరాజు ముందుకు సాగాడు. కృష్ణుడు నవ్వుతూ వారితో, "ఆయన ముందుగా భీష్మణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ, శల్యుణ్ణీ అనుమతి కోరి, తరవాత యుద్ధం ప్రారంభిస్తాడు. అలా పెద్దల అనుమతితో యుద్ధం చేస్తే విజయం లభిస్తుంది," అన్నాడు.

ఈ లోపుగా కౌరవసేనలో రకరకాల మాటలు పుట్టాయి.

"ఛీ, ఛీ! ఈ ధర్మరాజు క్షత్రియకులం చెడబుట్టాడు! యుద్ధం చెయ్యటానికి భయపడి, తన తమ్ములతో సహా భీష్మణ్ణి శరణువేడవస్తున్నాడు. అటువంటి తమ్ములుండగా ఇతను భయపడటం ఎంత సిగ్గు చేటు! తీరా యుద్ధం చెయ్యవలిసి వచ్చే సరికి గుండెజారిపోయి ఉంటుంది," అనుకున్నారు కౌరవయోధులు. వాళ్ళకు దుర్యోధనుడి పక్షంమీద గౌరవం పెరిగింది.

రెండు సేనలలో వాళ్ళూ, భీష్ముడితో ధర్మరాజు ఏమంటాడో, భీష్ముడు ఏం సమా



యుద్ధం చెయ్యి. గెలుస్తావు. నా నుంచి ఏ వరం కావాలన్నా కోరుకో. అందువల్ల నీకు అపజయం కలగదు. ధనం మనిషిని దాసుణ్ణి చేస్తుంది. అందు చేత నేను కౌరవులపక్షాన పోరాడవలిసి వచ్చింది. నువు దానికి భంగం లేకుండా ఏ వరమైనా కోరవచ్చు." అన్నాడు.

"ఓటమి ఎరగని నిన్ను ఈ యుద్ధంలో మేము ఓడించే ఉపాయం ఏది? మా శ్రేయస్సు కోరినవాడివైతే చెప్పు." అన్నాడు ధర్మరాజు.

"అదే నాకు తెలీదు. యుద్ధంలో నన్నె వడూ జయించలేడు. నాకు యుద్ధంలో చావు కూడా లేదు. మరొకసారి రా." అన్నాడు భీష్ముడు.

ధర్మరాజు భీష్ముడికి నమస్కారం చేసి, ద్రోణుడి రథం వద్దకు తమ్ములతోసహా వెళ్ళి, ద్రోణుడికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, "బ్రాహ్మణోత్తమా, యుద్ధం చెయ్యటానికి నీ అనుమతి కోరవచ్చాను. నీ అజ్ఞ లేకుండా శత్రువులను ఎలా జయించ గలను?" అన్నాడు.

దానికి ద్రోణుడు, "రాజా, నువు యుద్ధం తల పెట్టగానే ముందుగా నన్ను వచ్చి చూశావు కావెందుకు? అందుకుగాను నీకు అపజయం కలిగేటట్టు శపించి ఉండవలసి నదే. కాని ఇలా వచ్చావు గనక నేను సంతో

ధానం చెబుతాడో, యుద్ధమంటె ఒళ్ళు పొంగే భీముడు ఏమంటాడో, కృష్ణార్జునులు ఏం మాట్లాడతారో వినాలని ఎంతో ఆసక్తిగా ఉన్నారు.

ధర్మరాజు తన తమ్ములతో భయంకర మైన శత్రుసైన్యంలోకి జొరబడి, అతి వేగంగా భీష్ముణ్ణి సమీపించి, ఆయన పాదాల మీద పడి, "తాతా, యుద్ధంలో ఎవరూ ఎదుర్కోలేని నీతో యుద్ధం చెయ్య టానికి నీ అనుమతి కోసం వచ్చాం. నువు మాకు నీ అనుమతి ఇచ్చి, ఆశీర్వదించు." అన్నాడు.

దానికి భీష్ముడు, "నువు ఇలా వచ్చి నందుకు నాకు చాలా సంతోషమయింది.

షించాను. యుద్ధం చెయ్యి. గెలుస్తావు. నీ కేదైనా కోరిక ఉంటే చెప్పు. యుద్ధ సహాయం తప్ప మరేదైనా చేస్తాను. కౌరవుల ఉప్పు తిన్నందున వారి కోసం యుద్ధం చెయ్యక తప్పదు," అన్నాడు.

"మీరు కౌరవుల తరపునే యుద్ధం చెయ్యండి. నాకు మీ విజయాశీర్వాదం చాలు," అన్నాడు ధర్మరాజు.

"నీకు కృష్ణుడు తోడుండగా విజయాని కేమి లోటు? తప్పక జయిస్తావు," అన్నాడు ద్రోణుడు.

"నిన్ను ఓడించటం ఎవరికీ సాధ్యం కాదు. అలాటి నిన్ను మేము ఎలా ఓడించ గలమో చెప్పు," అని ధర్మరాజు ద్రోణుణ్ణి అడిగాడు.

"నేను యుద్ధం చేస్తున్నంత కాలమూ నీకు విజయం కలగదు. అందుచేత, నువ్వూ నీ తమ్ములూ సాధ్యమైనంత త్వరగా నన్ను చంపెయ్యండి," అన్నాడు ద్రోణుడు.

"అందుకే నిన్ను అడిగాను. నిన్ను చంపే ఉపాయమేది?" అని ధర్మరాజు మళ్ళీ అడిగాడు.

"నేను అస్త్రం పట్టి ఉండగా నన్నెవడూ చంపలేడు. కాని అప్రియం ఏదైనా నా చెవుల బడితే, అది కూడా నమ్మదగిన వాడు చెబితే, అస్త్రసన్యాసం చేస్తాను," అన్నాడు ద్రోణుడు.



తరవాత ధర్మరాజు కృపుడి వద్దకు వెళ్ళి, "గురువర్యా, మీ అనుమతితో యుద్ధం ప్రారంభించి విజయం పొందగోరి వచ్చాను," అన్నాడు.

కృపుడు కూడా సంతోషించి, భీష్మ ద్రోణులు చెప్పినట్టే యుద్ధసహాయం తప్ప మరేదైనా కోరుకోమని అన్నాడు. "నువ్వు ఎలా చస్తావు?" అని అడగటానికి బిడియ పడి ధర్మరాజు దీనంగా నిలబడ్డాడు. అది చూసి కృపుడు, "నన్ను ఎవరూ చంప లేరు. వెళ్ళి యుద్ధం చెయ్యి. నీకు జయం కలగాలని ఆశీర్వదిస్తున్నాను," అన్నాడు.

ధర్మరాజు కృపుడి వద్ద శలవు పుచ్చుకుని శల్యుడి వద్దకు వెళ్ళి, "మామా,

యుద్ధం చెయ్యటానికి అనుజ్ఞ ఇయ్యి. నీ అనుమతితో శత్రువులను జయిస్తాను," అన్నాడు.

శల్యుడు కూడా తన అనుమతి ఇచ్చి, ధర్మరాజుకు జయం కలగాలని ఆశీర్వదించి, యుద్ధంలో సహాయం తప్ప ఇంకేదైనా కోరమన్నాడు.

అప్పుడు ధర్మరాజు, "మహారాజా, యుద్ధ ప్రయత్నాల సమయంలో కర్ణుడి వధకు తోడ్పడమని కోరాను. అదే నేనిప్పుడు మళ్ళీ కోరుతున్నాను," అన్నాడు.

"ధర్మరాజా, తప్పక సహాయం చేస్తాను. నీకు యుద్ధంలో జయం కలుగుతుందని శపథం చేస్తున్నాను. వెళ్ళి యుద్ధం చెయ్యి," అన్నాడు శల్యుడు.

ధర్మరాజు తన తమ్ములతో సహా కౌరవ సేన నుంచి వెళ్ళిపోయాడు. కృష్ణుడు కర్ణుడి వద్దకు వెళ్ళి, "కర్ణా, నువు భీష్ముడు యుద్ధరంగంలో ఉన్నంత కాలమూ దుర్యోధనుడి పక్షాన యుద్ధం చెయ్యవుగదా, అంతదాకా పాండవుల పక్షాన యుద్ధంచెయ్యకూడదా? భీష్ముడు పడిపోయినాక కౌరవ పక్షాన యుద్ధం చెయ్యవచ్చు," అన్నాడు.

"నేను దుర్యోధనుడి కోసం ప్రాణాలైనా ఇస్తాను గాని అతనికి ఎన్నడూ అపకారం చెయ్యను," అన్నాడు కర్ణుడు.

కౌరవసేననుంచి బయటికి వచ్చిన ధర్మరాజు రెండుసేనల మధ్య నిలబడి, కౌరవసేన కేసి తిరిగి, "మీలో ఎవరైనా మాకు సహాయం చెయ్యగోరితే రండి," అని అడిగాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడి కొడుకులలో ఒకడైన యుయుత్సుడు ధర్మరాజు పట్ల అభిమానం కలవాడై, "నువు కోరితే నేను నీ పక్షానికి వచ్చి కౌరవులతో యుద్ధం చేస్తాను," అన్నాడు.

అందుకు ధర్మరాజు సంతోషంగా ఒప్పుకున్నాడు. ఆయన తన స్థానానికి తిరిగి వచ్చి కవచం ధరించాడు. అందరూ తమ తమ రథాలు ఎక్కారు. యోధులందరూ శంఖాలు పూరించారు. భేరులు మోగాయి. యుద్ధం ఆరంభమయింది.





# మిత్రభేదం

## 2

కరటకం కోతి కథ చెప్పగానే దమనకం ఇలా అన్నది:

"అన్నా, తన స్వార్థమే చూసుకుంటూ, ఏదో విధంగా పొట్ట పోసుకోవటమే లక్ష్యంగా పెట్టుకున్న వాడు పైకిరాలేడు. కడుపు నిండిన మాత్రాన ఉత్తమ జీవితం అలవడదు. చివరకు కాకికూడా తన ముక్కుకు అందిన చెత్త తిని కడుపు నింపుకుంటుంది. మిత్రులకూ, గురువులకూ, భృత్యులకూ, ఆపదలో ఉన్నవారికీ ఉపకరించని జీవితం ఏమి జీవితం? ఒక ఎముక దొరికితే, దానితో కడుపు నిండక పోయినా కుక్క సంతృప్తి చెందుతుంది. తోక ఆడిస్తూ, నోరు తెరిచి, వెల్లికిలాపడి తిండి కోసం ప్రాధేయ పడే జంతువును చూసి మనం ఎలా హర్షించ గలం? ఏనుగు అలా కాదు; అది ఆత్మాభిమానం గలది; ఎంతో బతిమాలితేనే గాని ఏమీ తినదు. సింహం తన పంజాకు అందుబాటులో ఉన్న నక్కను కూడా కొట్టదు; అది మదపుటేనుగును మాత్రమే చంపుతుంది. చంపటంలో కూడా ప్రకృతి ధర్మం ఉంటుంది. అలాటప్పుడు జీవించటంలో ఇంకెంత ఉండవచ్చు? చిన్న గుంట త్వరగా నిండుతుంది. అలాగే హీనులు కొద్ది ఆర్జనతో తృప్తిపడతారు. మంచి చెడ్డలకూ, ఉచ్చ నీచలకూ తేడా లేకపోయినా; సంస్కారం సంపాదించిన మనం విధిని ధిక్కరించక, పశుప్రవృత్తితో తృప్తిచెందినా; మానవులు మానవమృగాలుగా ఉండిపోతారే తప్ప; వారికీ జంతువులకూ తేడా ఏమిటి?"

"కాని, ఇందులో మన కర్తవ్యం ప్రసక్తి ఏమున్నది? మనం సింహం కింద కొలువు చెయ్యటం లేదుగదా!" అన్నది కరటకం.

అట్ట చివరి బొమ్మ



"పిచ్చివాడా, ఉద్యోగాలు ఉంటాయి, ఊడుతాయి. కర్తవ్యం మటుకు ఎల్లప్పుడూ ఉంటుంది. అర్హులకు పదవుల అవకాశం లేకపోదు. అనర్హులే త్వరగా తమ పదవులను కోల్పోతారు. క్రియకు గౌరవా గౌరవాలు మన అర్హతను బట్టే కలుగుతాయి. రాయిని కొండమీదికి ఎక్కించటం కష్టం, కిందికి దొర్లించటం తేలిక. అలాగే గౌరవ మర్యాదలు సంపాదించటం శ్రమతో కూడిన పని. కుక్షింభరులైన చవటలుగా ఉండి పోవటానికి ఏ శ్రమా అవసరం లేదు," అన్నది దమనకం.

"సరే, ఇంతకూ నీ ఉద్దేశం ఏమిటి? మన ఏలిక అయిన సింహాన్ని ఏమి అడుగుదామనుకుంటున్నావు?" అని కరటకం అడిగింది.

"మన ఏలిక దేన్నో చూసి గాని, ఏదో విని గాని భయపడినట్టున్నది. దాని భయం చూసి, దాని భృత్యులైన మిగిలిన మృగాలు భయపడ్డాయి. మన ఏలికకు ఏం చెయ్యటానికీ పాలుపోకుండా ఉన్నది," అన్నది దమనకం.

"సింహం వద్దకు వెళ్ళి, 'నువు భయపడ్డావు,' అని చెప్పటం ప్రమాదం. అందుచేత, మాట్లాడక ఊరుకో," అన్నది కరటకం.

"ధైర్యం గల వారికి ప్రమాద భయం ఉండదు. రాజుకు హితమైనది అడగక పోయినా చెప్పటం పౌరుడి ధర్మం. అదీ గాక రాజుగారి మన్ననలు పొందగోరే వాళ్ళు రాజుకు సన్నిహితంగా ఉండాలి. రాజుకు సన్నిహితుడై మసలేవాడు, రాజుగారి తత్వం గ్రహిస్తాడు," అన్నది దమనకం.

"సరే, నీ కంత పట్టుదలగా ఉంటే వెళ్ళు. కాని జాగ్రత్తగా ఉండు సుమా. మన ఇద్దరి అదృష్టమూ నీ విజయం మీద ఆధారపడి ఉన్నది," అన్నది కరటకం.

దమనకం తన అన్నకు నమస్కారంచేసి పింగళకం వద్దకు వెళ్ళింది.

పింగళకం దమనకాన్ని చూసి, "దాన్ని నా దగ్గిరికి రానివ్వండి. అది నా పాత

భృత్యుడి కొడుకు," అని తన అనుచరులతో అన్నది. దమనకం సింహం సన్నిధికి వచ్చి, సింహానికి నమస్కరించి, సింహం అనుమతితో కూర్చున్నది.

"కులాసాగా ఉన్నావా? ఇంత కాలం నాకు కనపడలేదేం? ఇప్పుడు రావటానికి కారణ మేమిటి?" అని పింగళకం అడిగింది.

"ఏలిక పిలవనంపక పోయినా, రావటం నా ధర్మమని తోచింది. నా వంటి అల్పుడి వల్ల కూడా ప్రయోజనం ఉంటుంది. తరతరాలుగా తమను కొలిచిన వాళ్ళం కావటం చేత మంచి కాలంలోనూ, కష్టకాలంలోనూ మాకు తమరిని అనుసరించటం విధాయకం. 'నన్ను ఇంత కాలం ఎందుకు చూడ రాలేదు?' అని తమరు అడిగారు. నన్ను తమరు తమ మంత్రివర్గంలో చేర్చారా? ఆలోచనకు రమ్మని పిలిచారా? భృత్యులలో అర్హులెవరో, అనర్హులెవరో యజమాని గ్రహించనప్పుడు అర్హులైనవారు యజమానులకు దూరంగా ఉండి పోతారు," అన్నది దమనకం.

"నక్కా, ఇంతకూ నువు చెప్పదలిచిన దేమిటి?" అన్నది పింగళకం.

"నక్కనని నన్ను తమరు చిన్నచూపు చూడవద్దు. మేలైనపట్టు పురుగుల నుంచి వస్తుంది. రాతి నుంచి బంగారం వస్తుంది.



కర్ర నుంచి అగ్ని వస్తుంది. దీనిని బట్టి జన్మలో ఏమీ లేదు, గుణం ప్రధానం అని తెలుస్తుంది. అందుచేత నన్ను తమరు హీనంగా చూడవద్దు. నేను విశ్వాస పాత్రుణ్ణి, ఇతరులలాగా స్వలాభం చూసుకునే వాణ్ణి కాను," అన్నది దమనకం.

"నాకు తెలియదా? ఇవాళ నీ రాకకు కారణం ఏమిటో చెప్పు," అన్నది పింగళకం.

"నేనొక ముఖ్య విషయం తమతో చర్చించాలి. ప్రభువువారు నీరు తాగటానికి నది వద్దకు వెళ్ళి, అంతలోనే తాగకుండా ఎందుకు తిరిగి వచ్చారు?" అని దమనకం అడిగింది.

తన భయం గురించి ఈ నక్కకు తెలియనివ్వటం మంచిది కాదని, "ప్రత్యేకించి కారణం ఏమీ లేదు. తాగబుద్ధి కాలేదు," అన్నది పింగళకం.

"చెప్పకూడని రహస్యమైతే పోనియ్యండి. అన్ని విషయాలూ అందరితోనూ చెప్పదగినవి కావు," అన్నది దమనకం.

దమనకం బుద్ధి సూక్ష్మతలో గురికుదిరి, పింగళకం, "మన అరణ్యంలోకి ఒక భయంకరమైన మృగం వచ్చింది. దాని రంకె మహాభయంకరం! నేను ఈ అరణ్యాన్ని విడిచిపెట్టి పోదామనుకుంటున్నాను," అన్నది.

"అదేమిటి? ఏలిన వారు ధ్వనికే భయపడుతున్నారా? తమ పూర్వీకులు కష్టపడి సంపాదించిన ఈ అరణ్యరాజ్యాన్ని విడిచిపుచ్చటం భావ్యమా? అదీగాక ధ్వనులన్నీ ప్రమాదం కలిగించవు. ఉరుములు వింటాం. తుపాను ధ్వని వింటాం. కాని ఇవి మనకు కీడుచేయవు. ధైర్యశాలి దేనికీ భయపడడు, విధికికూడా జడియడు. మీరు ధైర్యంగా ఉండండి. మీరు విన్న రంకెను లక్ష్యపెట్టకండి. మీరు రణదుందుభి కథ వినలేదా?" అన్నది దమనకం.

"ఏమిటా కథ?" అని పింగళకం అడిగింది.

దమనకం ఇలా చెప్పింది:

ఆకలి గొన్న ఒక నక్క ఆహారం కోసం వెతుకుతూ యుద్ధభూమికి వెళ్ళింది. అక్కడ దానికి ఒక భయంకరమైన ధ్వని వినవచ్చింది. నక్క భయపడి, "చచ్చానురా, దేవుడా!" అనుకున్నది. తీరాచూస్తే, ఒక చెట్టు కింద కొమ్మకు ఒక రణదుందుభి కట్టి ఉన్నది. గాలికి కొమ్మలు కదిలి, దాన్ని కొట్టటం చేత ధ్వని వస్తున్నది. దాని నిండా మాంసం ఉంటుంది, తినవచ్చుననుకుని ఆ నక్క దాన్ని ఒక పక్కనుంచి కొరికి రంధ్రం చేసింది. కాని ఆ దుందుభిలో కొయ్యా, చర్మమూ తప్ప నక్కకు ఏమీ కనిపించ లేదు.

దమనకం ఈ కథ చెప్పి, "ధ్వనులను బట్టి ఏమీ నిర్ణయించరాదు," అన్నది.



# 140. క్రీస్తు జన్మస్థలం

బెత్లెహేం (జోర్డాన్) లోని ఈ చర్చిలో ఏసుక్రీస్తు జన్మించిన ప్రదేశం ఉన్నది. కోటను పోలి ఉన్న ఈ చర్చి తొలి కాలపు క్రైస్తవశిల్పాన్ని సూచిస్తుంది. శతాబ్దాల మీద ఇందులో పెద్ద మార్పులేవీ జరగలేదు.



Photo by P. Sundaram



బహుమతి
పొందిన వ్యాఖ్య

నేను చేసిన నీవు

పంపినవారు :
చల్లా సత్యనారాయణ

Photo by D. N. Shirke



బీచ్ రోడ్,
విశాఖపట్నం.

మమ్మేలుతున్నావు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు అగస్టు నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు అక్టోబరు నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | | | |
|---|---|---|---|---|---|
| మైనపుబాతు | .... | 3 | చద్ది అన్నం | .... | 37 |
| యక్షపర్వతం – 15 | .... | 9 | "చూసి నేర్చుకో" | .... | 39 |
| విలువిద్యా ప్రదర్శనం | .... | 17 | వింతకానుక | .... | 41 |
| సొంతకల | .... | 23 | వెర్రిబాగులవాడు | .... | 44 |
| కోళ్ళ దొంగ | .... | 27 | మహాభారతం | .... | 49 |
| అర్ధరాత్రివ్యాపారం | .... | 31 | మిత్రభేదం - 2 | .... | 57 |


రెండవ అట్ట:
జంఘిస్‌ఖాన్

మూడవ అట్ట:
శివాజీ


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# ఆత్మరక్షణలో తొలిపాఠం




























**ఫోర్‌హాన్స్**
దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్‌పేస్టు



# ఫన్-న్-ఫేర్‌లో మీరు కూడా చేరండి

అందరు రండి. పెయింట్ చేయండి, తమాషా చూడండి! కేమ్లిన్ యొక్క ఆనందం కలిగించే రంగులను మీరు వాడండి. పలు వరుసలోనున్న ఆకర్షణీయమైన రంగులలో మీకు ఇష్టమైనది తీసుకోండి. మిమ్ములను ఊహాలోకంలో పరుగిడ నివ్వండి.

వాటర్ కలర్ ట్యూబ్స్




## కేమెల్
### ఆర్ట్ కలర్స్



కేమ్లిన్
ప్రైవేట్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్ డివిజన్
జె. బి. నగర్,
బొంబాయి 400 059 ఇండియా






వాటర్ కలర్ కేక్స్

పోస్టర్ కలర్స్

